THE ANDHRA PATRIKA - MADRAS.

6 పేజీలు వెల 1 అణా. హాఫ్ 0-1-2.

హైద్రాబాద్ మంత్రివర్గం: ముఖ్యమంత్రి శ్రీ రామకృష్ణరావు వివరణ —2 వ పేజీ

# ఆంధ్రపత్రిక

అన్నిపనులపైనా ఖర్చు తక్కువచేయడానికి గుంటూరు జిల్లా బోర్డు ఆలోచన —6 వ పేజీ

Regd. No. M. 1118 సంపుటం 39. సంచిక 328 FOUNDER : DESODHARAKA K. NAGESWARA RAO. మంగళవారము 3-3-1953

# కృష్ణానదిపై రెగ్యులేటర్ బ్రిడ్జి నిర్మాణానికి రాష్ట్రప్రభుత్వ విముఖత

## ఆంధ్రప్రాంతంలో టెలిఫోన్ సౌకర్యాల అభివృద్ధికి 1953-54 కేంద్ర అంచనాల కేటాయింపు

### రాజమండ్రీ, విశాఖపట్నం, విజయవాడలలో అదనపు లైన్లు ఇవ్వడానికి కొత్త ఏర్పాట్లు

### విజయవాడ విమానాశ్రయం

గృహనిర్మాణానికి 51 వేలు: విద్యుచ్ఛక్తికి 50 వేలు కేటాయింపు

న్యూఢిల్లీ, మార్చి 1: ఈ ఆర్థిక సంవత్సరపు ఖర్చుల అంచనాల్లో విజయవాడ విమానాశ్రయంలో నివాసగృహం నిర్మాణంకోసం రూ. 51,000, విమానాశ్రయానికి ఎలెక్ట్రిసిటీని సప్లయి చేయటానికి రూ. 50,000 ప్రత్యేకించారు. బేగంపేటలో గృహనిర్మాణానికి రూ. 1,25,000 ప్రత్యేకించారు.

ఆంధ్ర మహిళాసభ (మద్రాసు)లో వైద్యసంబంధమైన కార్యక్రమాలకు రూ. 15,000 ఇస్తారు.

మదనపల్లి క్షయ ఆసుపత్రిలో క్షయనివారణకు ప్రత్యేక పరిశోధన చేయటంకోసం రూ. 70,000 గ్రాంటును ప్రత్యేకించారు.

మద్రాసు ఫ్లయింగ్ క్లబ్బుకు రూ. 1,88,000 బడ్జెట్‌లో ప్రత్యేకించారు.

కర్నాటక సంగీత కళాశాల, పరిశోధకులకు రూ. 40 వేలు. మద్రాసు విశ్వవిద్యాలయంలో సంస్కృత లిఖితగ్రంథాల జాబితా తయారు చేయటానికి రూ. 6 వేల గ్రాంటు ఇవ్వటానికి ఏర్పాటుచేశారు.

(స్వ. వి.)

### ఖమ్మంమెట్టు, నిజామాబాదు, హిందూపురం గుడివాడలలో టెలిఫోన్ 'ఎక్స్ఛేంజీ'ల స్థాపన

['ఆంధ్రపత్రిక' విలేఖరి]

న్యూఢిల్లీ, మార్చి 1: ఆంధ్రప్రాంతంలో అనేక పట్టణాల్లో టెలిఫోన్ సౌకర్యాలను కలుగజేయటానికి, ఉన్న సౌకర్యాలను అభివృద్ధి చేయటానికి, 1953-54 సంవత్సరపు ఖర్చు అంచనాల్లో ఏర్పాటు చేయబడింది. ఈ సంవత్సరం కొత్తగా ఖమ్మంమెట్టు, గుడివాడ, జడచర్ల, హిందూపురం, నైజాంబాదు, పెద్దాపురం పట్టణాల్లో టెలిఫోన్ ఎక్ఛేంజీలు పెట్టటానికి ఖర్చు అంచనాల్లో చేర్చబడింది. గూడూరు, హాస్పేట కూడా జాబితాలో ఉన్నాయి.

సైఫాబాదు, నరసరావుపేట, మచిలీపట్నం, సికిందరాబాదు, ఖమ్మంమెట్టు, మదరాసులలో ప్రత్యేకంగాభవనాలను కట్టించటానికిగూడా బడ్జెట్‌లో వీలుచేశారు.

ఇవిగాక, గుంటూరు, అనకాపల్లి, తెనాలి, వరంగల్, హైదరాబాదు, మద్రాసులలో అదనంగా తీగలు కేబుల్సు వేయటానికి గూడా ఖర్చులో ప్రత్యేకించారు. నంద్యాల, కర్నూలులలో

(2-వ పేజీ చూడుడు)

### 1951 లో ప్రపంచ జనాభా 250 కోట్లు

సమితి కార్యాలయం, మార్చి 1: 1951 లో ప్రపంచజనాభా 250 కోట్లకు కొంచెం తక్కువగా వున్నదని సమితి సేకరించిన సమాచారాన్నిబట్టి తెలుస్తున్నది.

### అసెంబ్లీ కౌన్సిల్ ఉపఎన్నికలు

మద్రాసు, మార్చి 2: మద్రాసు అసెంబ్లీకి ఆంధ్రరాష్ట్రనిర్మాణం, శ్రీరాములు నిర్యాణం సందర్భంలో రాజీనామా ఇచ్చిన తెన్నేటి విశ్వనాథం ప్రభృతుల స్థానాలకు ఎన్నిక తేదీలు కౌన్సిలు స్థానాల ఎన్నిక తేదీలు ఎలెక్షను కమీషనువారినుంచి, జాబు వచ్చాక నిర్ణయింపబడు నన్నారు.

## లాహోర్ వీథుల్లో 'జఫ్రుల్లా' వేషం ఊరేగింపు

### బర్తరఫ్ నినాదాలు; ప్రదర్శనలు

లాహోర్, మార్చి 1: జఫ్రుల్లా ఖానును పాకిస్తాన్ విదేశాంగ మంత్రిపదవినుంచి తొలగించాలనీ, ఆయనజాతి అయిన అహ్మదీయులను అల్ప సంఖ్యాకులుగా ప్రకటించాలనీ నేడు కూడా ఇక్కడ ప్రదర్శనాలు జరిగాయి. లక్షపైచిలుకు జనం పెద్దపెట్టున నినాదాలు చేసుకొంటూ ముఖ్యవీథుల గుండా నిన్నటికి మల్లేనే శాసనసభా భవనంవద్దకు వెళ్ళి ఆగారు కొందరు ప్రదర్శకులు ఒకనికి జఫ్రుల్లాఖాన్ వేషంవేసి తమ బుజాలమీద ఎక్కించుకొని వానికేసి చూపిస్తూ 'వీణ్ణి బర్తరఫ్' చేయాలని కేకలు వేశారు.

దారిపొడుగునా 'వజీముద్దీన్ హైహై', 'జఫ్రుల్లా హైహై' అనేనినాదాలతో ధంగారా వీథుల్లో నృత్యం చేశారు. రెండు పార్టు పోలీసు అవరోధాన్ని విచ్ఛిన్నం చేశారు. యువకులు లారీలు పుచ్చుకొన్న పోలీసులు దౌర్జన్య సంఘటనలు నివారించేందుకు ట్రక్కులలో ఊరేగింపు వసరించారు. శాసనసభా భవనంవద్దకు చేరాక సుమారు 80 మందిని పోలీసు లారీలలో పంపివేశారు. కుంపు తిరిగి వచ్చిన దారినే బయలుదేరి ప్రభుత్వ కచ్చేరీల ముందూ, అహ్మదీయులకు చెందిన దుకాణాలముందూ ప్రదర్శనాలు చేస్తూ ఊరేగింపు సాగించారు.

దీనికి ముందు, ఈ ఆందోళన సందర్భంలో గవర్నరును కలుసుకోవబోతున్న 15 మంది వలంటీర్లనూ, వారి నాయకుడు మౌలానా అహ్మదల్లీ నీ పోలీసులు అరెస్టు చేసినట్లు తెలిపింది. ఇంతవరకూ ఇక్కడ అరెస్టయినవారి సంఖ్య 150 నిన్న కస్టడీలోకి తీసుకోబడిన 20 మంది వాలంటీర్లను దరిమిలాను పట్టణానికి 5 మైళ్ళ దూరాన వదిలివేశారని తెలిసింది. ఆందోళన నాయకులను మాత్రమే డిటెయిన్ చేస్తున్నారు.

శాసన విరుద్ధ, దుండగీడు చర్యలను కఠినంగా అణచివేయటానికి ప్రభుత్వం దృఢనిశ్చయంతో వున్నదని ప్రభుత్వ ప్రతినిధి ఒకరన్నారు.

లాహోర్-గుజరన్‌వాలా రైలు మార్గంలో మురుద్కే, కమోకే అనేచోట్ల అహ్మదీయ వ్యతిరేకులు ఒక పాసింజరును నిలిపినట్లు తెలిసింది.

లాహోరులోని ఉర్దూ పత్రిక ఒకటిలో పురాతనపుదైన జమీందార్ ఈ ఆందోళనలో ముందుకు వేస్తున్నందున పంజాబ్ ప్రజారక్షణచట్టం కింద ఒక సంవత్సరంపాటు ఆపత్రికను నిషేధించారు.

## 50 లక్షలు మంజూరుచేయడానికి కేంద్రప్రభుత్వం సిద్ధంగావున్న సూచన

### 40 లక్షల ఖర్చుతో ఇప్పుడు జరుగుతున్న ఆనకట్ట మరమ్మతు నిరర్థకమని అధికార్ల స్పష్టీకరణ

(ఆంధ్రపత్రిక విలేఖరి)

విజయవాడ, మార్చి 2: కృష్ణ ఆనకట్టకు 20 గజాల దూరంలో రోడ్డు బ్రిడ్జి, రెగ్యులేటర్‌ల నిర్మాణ పథకాన్ని రాష్ట్రప్రభుత్వ హైవేస్ శాఖవారు, కేంద్రప్రభుత్వంవారు ఆమోదించినా, రాష్ట్రప్రభుత్వం ఆమోదించడం లేదని తెలుస్తున్నది. కేంద్రప్రభుత్వం యీ ప్రణాళికకు తనవాటాగా 50,00,000 రూపాయలు ఇస్తానన్నట్లుకూడా తెలుస్తున్నది. ఈ నిర్మాణం జరగనిపక్షంలో ప్రస్తుతం జరుగుతున్న మరమ్మతులు ఆనకట్టను ప్రమాదంనుంచి తప్పించలేకపోవచ్చునని కొందరంటున్నారు.

ప్రస్తుతం జరుగుతున్న మరమ్మతులు చురుగ్గా జరుగుతున్నవి. ఈ వేసవిలోగా అవి పూర్తి కావచ్చు.

"వెంటనే రోడ్డు బ్రిడ్జి రెగ్యులేటరు నిర్మాణానికి పూనుకొనకపోయినచో కూలిపోయిన కృష్ణానకట్ట, రు 40 లక్షల ఖర్చుతో మరమ్మతులు చేస్తున్నప్పటికి నిలవడం అనుమానమేనని, ఈ రోడ్డుబ్రిడ్జి రెగ్యులేటరు నిర్మాణం ఎప్పుడో ఒకప్పుడు నిర్మించబడకతప్పదని, కాలయాపన లేకుండా వెంటనే ఈ నిర్మాణానికి ఉత్తర్వులు జారీచేయవలసింది"గా చీఫ్ యింజనీరుతో సహా ఇరిగేషను శాఖ యింజనీరు మద్రాసు ప్రభుత్వానికి తెలియజేసినట్లు విశ్వసనీయంగా తెలుస్తున్నది.

విడిగా రోడ్డుబ్రిడ్జి నిర్మాణానికి రు 85 లక్షలవరకు ఖర్చు అవుతుందని, కాని రోడ్డుబ్రిడ్జి, రెగ్యులేటరు రెండు కలిసి నిర్మించినట్లయితే మొత్తం రు 2.3 కోట్లలోనే ఈ నిర్మాణం పూర్తిచెయ్యవచ్చునని, ఈ మొత్తం ఖర్చులో రు 55 లక్షలు రహదారుల శాఖవారు భరించుటకు అంగీకరించారనిగూడ తెలుస్తున్నది. రెగ్యులేటర్

(3 వ పేజీ చూడుడు)

### బడ్జెట్‌పై పార్లమెంట్ కాంగ్రెస్‌పార్టీ చర్చ

ముఖ్య విషయాలను గూర్చి దేశ్‌ముఖ్ వివరణ

న్యూఢిల్లీ, మార్చి 2: కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీవారు నేటిఉదయం భారత ప్రభుత్వ బడ్జెటును 2½ గంటలసేపు సర్వతోముఖంగా పరిశీలించారు.

శ్రీ సి. డి. దేశ్‌ముఖ్ చర్చ ప్రారంభిస్తూ ప్రస్తుత ఆర్థిక పరిస్థితిని సభ్యులకు వివరించి చెప్పారు.

దేశంలో ద్రవ్యోల్బణ శక్తులు నిరోధించబడినవని, బడ్జెటులో ఆర్థిక పరిస్థితుల విషయమై తాను చేసిన సమీక్ష సుస్పష్టముగా వున్నదని శ్రీ దేశ్‌ముఖ్ చెప్పినట్లు తెలుస్తున్నది. 'పన్నులు విధించడం కంటె ద్రవ్యం కూడబెట్టడానికి నేను యెక్కువ ప్రాముఖ్యం యిచ్చాను. ఇప్పుడు పెద్ద పన్నులు విధించడం సాధ్యం కాదు. రెండు సంవత్సరాల క్రిందటి పరిస్థితి వేరు. అప్పుడు పన్నులు విధించడం అవసరమైంది. పన్నులు విధించకపోతే మిగులుగా వున్న ద్రవ్యం హానికరంగా పరిణమించి వుండేది' అని దేశ్‌ముఖ్ చెప్పినట్లు తెలుస్తున్నది.

విదేశీయుల ద్రవ్య సహాయం అవసరమని, ఇట్టి సహాయంవల్ల మన ఆర్థిక స్వాతంత్ర్యానికి యెట్టి భంగమూ కలగదని దేశ్‌ముఖ్ అన్నారట.

బడ్జెటు నిర్వచిస్తున్న ముఖ్య సూత్రాలను కాంగ్రెస్ సభ్యులు అంగీకరించాలని పార్టీ నాయకుడు పండిత నెహ్రూ ఉద్బోధించినట్లు తెలుస్తున్నది. 'కొత్త సిద్ధాంతాలను నిర్వచించకుండా బడ్జెటులోని సిద్ధాంతాలు కార్యరూపం దాల్చే మార్గాలు సూచించండి' అని నెహ్రూ కోరారు.

పార్టీవారు ఈ వారంలో మరొకసారి సమావేశమై చర్చ సాగిస్తారు.

### థేమ్స్ ముఖద్వారంలో 'జలదుర్గ' విధ్వంసం

పొగమంచులో కనబడక నౌక ఢీ కొన్న ఫలితం

లండన్, మార్చి 2: థేమ్సునదీ ముఖద్వారంలో శత్రు విమానాలనూ, జలాంతర్గాములనూ అటకాయించటానికి నిర్మించబడ్డ 'యు-5' అనే జలదుర్గం నిన్న పొగమంచులో దారి కనిపించక బాల్టిక్ అనే స్వీడిష్ నౌక ఢీ కొట్టుకున్నందువల్ల ధ్వంసమయి పోయింది. దాదాపుగా అందులో ఉన్న 150 మంది భటులంతా మరణించి ఉండవచ్చునని తెలుస్తున్నది. థేమ్సునది సముద్రంలో కలిసేచోట సిమెంటు స్తంభాలమీద ఈ జలదుర్గాన్ని నిర్మించారు.

ఓడకేమీ నష్టం కలగలేదు. కాని దుర్గంలో ఉన్న వారంతా నష్టమయినట్లు తెలుస్తున్నదనీ, సముద్రంలో పడిన వాళ్ళను రక్షించటానికి ప్రాణరక్షణ నావలను పంపుతున్నట్లు బాల్టిక్ నౌక రేడియో ద్వారా తెలిపింది. ఇతర నౌకలుకూడా రక్షణలో సాయపడటానికి వెడుతున్నవి.

దుర్గంలో గల పారిశ్రామికుల్లో 4 గురు కనిపించటం లేదని యుద్ధ కార్యాలయం ప్రకటించింది. దుర్గ స్తంభం ఒకటి నౌకమీదపడి దానిని ముంచగా, తిరిగి తేల్చటం జరిగిందనీ, దుర్గంలో ప్రమాద సమయంలో 10 మంది ఉన్నారనీ ఆ ప్రకటన తెలుపుతున్నది.

### జిల్లాకొక విద్యా సలహా సంఘం

హైద్రాబాదు ప్రభుత్వ నిర్ణయం

సికింద్రాబాదు, మార్చి 1: విద్యకు సంబంధించిన విషయాలపై ప్రభుత్వానికి సలహా లిచ్చేందుకుగాను జిల్లాకు ఒక సంఘాన్ని యేర్పాటుచేయుటకు హైద్రాబాదు ప్రభుత్వం నిశ్చయించింది. ఈ సంఘాలలో, జిల్లాకలెక్టర్లు, జిల్లా స్కూళ్ల ఇన్స్పెక్టర్లు ప్రభుత్వ స్కూళ్ల ప్రధానోపాధ్యాయులు, ప్రధానోపాధ్యాయినులు సభ్యులుగా ఉంటారు.

## కాంగ్రెస్‌తో సహకారంపై ప్రజాసోషలిస్టు పెద్దల చర్చ

### ఆంధ్రదేశ పరిస్థితిపై ప్రకాశంగారి వివరణ

న్యూఢిల్లీ, మార్చి 1: ఆంధ్రదేశంలో ప్రస్తుత పరిస్థితులు, కాంగ్రెసుతో సహకారం చేయడం మొదలయిన విషయాలను గురించి ఇక్కడ సమావేశమవుతున్న ప్రజాసోషలిస్టుపార్టీ నాయకులు సమాలోచనలు జరుపుతున్నారని తెలుస్తున్నది.

ప్రజాసోషలిస్టుపార్టీనాయకుడు ఆచార్య జె. బి. కృపలాని, ప్రధానకార్యదర్శి అశోక మెహతా, శ్రీ జయప్రకాశ్‌నారాయణ్, ఆచార్య నరేంద్రదేవ్, సి. కేలప్పన్, టంగుటూరి ప్రకాశం పంతులు, డాక్టర్ సి. సి. ఘోష్ ప్రభృతులు ఈ సమాలోచనలో పాల్గొంటున్నారు.

ప్రకాశం పంతులుగారు ఆంధ్రదేశంలో ప్రస్తుత పరిస్థితులను గురించి కాంగ్రెసుతో ప్రజాసోషలిస్టు పార్టీ ఆయా సమస్యల మంచిచెడ్డలను బట్టి సహకరించినట్లయితే రాగల పరిణామాలనుగురించి ఇతర ప్రజాసోషలిస్టు నాయకులకు తెలియచేసినట్లు తెలుస్తున్నది.

అతర్వాత ప్రజాసోషలిస్టుపార్టీ కాంగ్రెసుతో సహకరించే విషయంగురించి ప్రధాని నెహ్రూ ప్రజాసోషలిస్టుపార్టీనాయకులకును జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలు, సంప్రతింపులు మొదలయినవాటినిగురించి సమాలోచనలు జరిగినవట.

ప్రధాని నెహ్రూ ప్రజాసోషలిస్టు నాయకులకు మొదట వ్రాసిన జాబులలో కులతత్వవాదులను, ప్రేరేపకశక్తులను ఎదుర్కొనే విషయంగురించి ప్రస్తావించారనీ, అరేడువాతి వ్రాసిన జాబులలో ఇతర విషయాలుకూడా ప్రస్తావించారనీ తెలుస్తున్నది.

పంచవర్షప్రణాళిక ప్రణాళిక విజయవంతంగా అమలుజరిపే విషయంలో ప్రతివారు ప్రభుత్వంతో సహకరించాలనే విషయానికి ప్రధాని నెహ్రూ అత్యధిక ప్రాముఖ్యం ఇచ్చారు.

ప్రజాసోషలిస్టుపార్టీ నాయకుల ఈ సమాలోచనలు రేపుకూడా జరుగుతవు. (పి. టి. ఐ.)

### మైసూరు రాజపుత్రునికి నామకరణం

మైసూరు, మార్చి 2: నేడు మైసూరు మహారాజానుకు ఇటీవల జన్మించిన రాజపుత్రునికి నామకరణోత్సవం చేశారు. రాజకుమారునికి శ్రీకంఠదత్త నరసింహరాజ ఒడయార్ అని పేరు పెట్టబడ్డది.

## వారంతంలోగా పెప్సూలో అధ్యక్షపాలన ఏర్పాటు

### కొత్తనాయకుని ఎన్నికకు 'ఫ్రంట్' సన్నాహం

న్యూఢిల్లీ, మార్చి 1: పెప్సూ ముఖ్యమంత్రి సర్దార్ జ్ఞానసింగ్ రరేవాలా రాజీనామా ఇవ్వడంవల్ల అధ్యక్షుడు రాష్ట్ర పరిపాలనమును స్వీకరించే అవకాశం యేర్పడింది.

తన ఎన్నికను విచారణ సంఘంవారు రద్దుచేసిన 8 రోజులకు సర్దార్ రరేవాలా పెప్సూ, పాటియాలా రాజప్రముఖునికి రాజీనామా సమర్పించారు. రరేవాలాగారు ఢిల్లీలో ప్రధానితోను, శాసనసభల మంత్రి డా॥ కట్జూతోను సంప్రదింపులు జరిపిన తరువాతనే రాజీనామా యిచ్చారు. పెప్సూ రాజప్రముఖ్ రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికూడా ఢిల్లీవెళ్లి రాష్ట్రాల శాఖతో పెప్సూ వ్యవహారాలను గూర్చి చర్చించారు.

సర్దార్ రరేవాలా యునైటెడ్ ఫ్రంట్ మంత్రివర్గ నాయకుడు. భారతదేశం మొత్తంమీద కాంగ్రెసేతర మంత్రివర్గం యిది ఒక్కటే. ఎన్నికల అనంతరం ఈ మంత్రివర్గం అధికారం స్వీకరించింది.

పెప్సూ పరిపాలనను స్వీకరిస్తూ అధ్యక్షుడు వచ్చే వారం ఆదేశాన్ని జారీచేస్తారని తెలుస్తున్నది.

పెప్సూలోపార్టీపరిస్థితి అస్పష్టంగా వున్నది. దీనికితోడు ఎన్నికల విచారణ సంఘంవారు 9 మంది అసెంబ్లీ సభ్యుల ఎన్నికను రద్దుచేశారు. వీరిలో ఎలుగురు మంత్రులున్నారు. ఇంకా కొన్ని ఎన్నికల దరఖాస్తులు విచారణలో వున్నవి.

అసెంబ్లీ సభ్యులసంఖ్య 61. వీరిలో యునైటెడ్ ఫ్రంటు బలము 25. కాంగ్రెసు సభ్యుల సంఖ్య 21. ఇద్దరు కమ్యూనిస్టులు ఇతరు స్వతంత్రులు.

అసెంబ్లీలో తనకు మెజారిటీ వున్నదని, తాను స్థిరంగావుండే మంత్రివర్గాన్ని యేర్పరచ వీలవుతుందని యునైటెడ్ ఫ్రంటువారు అంటున్నారు. కాని రాష్ట్రమును పరిపాలించగల స్థిరమైన మంత్రివర్గం యేర్పడే అవకాశం లేదని కేంద్ర ప్రభుత్వం తలుస్తున్నట్లు వున్నది.

పెప్సూలో అసెంబ్లీని రద్దుచేసి ఎన్నికలు జరపడం గూడా అసాధ్యమే. ఎందువల్ల ననగా కొత్తనియోజకవర్గాలను యేర్పరిస్తేనేగాని ఎన్నికలు జరగడానికి వీలులేదు. గత ఎన్నికలకు ఆధారభూతంగా వుండిన నియోజకవర్గాలు గత జనవరి 26 నుండి రద్దయినవి. నియోజకవర్గాలను మార్చేందుకు పార్లమెంటు నియమించిన సంఘము తమపని పూర్తిచేయడానికి అధమపక్షం ఆరుమాసాలు పట్టుతుంది.

పెప్సూ ఎసెంబ్లీ బడ్జెటు సమావేశము మార్చి 16 వ ప్రారంభమవుతుంది.

రరేవాలా స్థానే కొత్తనాయకుని ఎన్నుకోడానికి యునైటెడ్ ఫ్రంటు అసెంబ్లీపార్టీ మార్చి 3 వ సమావేశమవుతున్నదని పెప్సూ వార్త తెలుపుతున్నది.

## 'స్టాలిన్ ఐసెన్‌హోవర్ చర్చలకు చర్చిల్‌ను కూడా ఆహ్వానించాలి

### ఆస్ట్రేలియాకార్మికనాయకుడు ఇవాట్ సూచన

సిడ్నీ, మార్చి 1: అమెరికా అధ్యక్షుడు ఐసెన్‌హోవర్ సోవియట్ రష్యా అధిపతి మార్షల్ స్టాలిన్ సమావేశం జరిగేటట్లయితే అందులో పాల్గొనవలసిందిగా బ్రిటిషు ప్రధాని చర్చిల్‌ను కూడా ఆహ్వానించడం అవసరంఅని ఆస్ట్రేలియా లేబర్ పార్టీ నాయకుడు డాక్టర్ ఇవాట్ అన్నారు. ఈ నాయకత్రయం చేసే నిర్ణయాలను బ్రిటిష ప్రజలు కామన్వెల్తు దేశాల వారు ఆమోదించ

(2 వ పేజీ చూడుడు)

## కొరియాలో తెగించి పోరాడే ప్రత్యేక సైనాదళాల ప్రయోగం

### మధ్యరంగంలో కమ్యూనిస్టులదాడి వైఫల్యం

సియోల్, మార్చి 1: దక్షిణ కొరియా సేనలు నేడు మధ్యరంగంలో చైనాకమ్యూనిస్టులను ఎదుర్కొని తరిమివేసినవి. 50 నిముషాలసేపు జరిగిన ఈపోరాటంలో కమ్యూనిస్టు సైనికులు 31 మంది చంపబడినారట. పశ్చిమరంగంలో కమ్యూనిస్టులు జరిపిన మరొకదాడి 15 నిముషాల పోరాటానంతరం చెదరగొట్టబడిందట.

దూరప్రాచ్య విమానదళ విమానాలు ఫిబ్రవరిలో కమ్యూనిస్టుల తొలుకు 1278 టాంకులను, 1865 సప్లయి లారీలను నాశనం చేశాయట. ఈ యుద్ధం ఆరంభం అయింది లగాయతూ ఇంతవరకూ కమ్యూనిస్టులవి 578, మిత్రరాజ్యాలవి 51 జెట్ విమానాలు నాశనమయాయట.

గతరాత్రి 8 బి విమానాలు పాన్‌గాన్‌కు దక్షిణాన 10 మైళ్లలో గల సిసన్నిలోని సప్లయిస్థావరం పైన 8 విమానాలు బీమ్యాన్స్ ఫ్రైస్ కేంద్రానికి సమీపంలోగల యోన్గాంగ్ లోని సప్లయిస్థావరంమీదా దాడులు చేశాయి.

చైనాకమ్యూనిస్టు బలగాలు నేడు రంగంలోకి ప్రాణార్పణము లెక్క చేయక తెగించిపోరాడే ఆత్మాహుతి దళాలను పంపాయని 8 వ సైన్యం ప్రధాన కార్యాలయం ప్రకటించింది. ఈదళాలు ప్రేలుడు వస్తువులు చేతబట్టుకొని అమెరికను ప్రాంతాలమీదికి వచ్చాయట. ఈవచ్చినవారిని అమెరికన్లు కాల్చివేశారనీ, 15 మంది చనిపోయారనీ, 20 మందిఅయినా గాయపడి వుంటారని అంటున్నారు.

### జిప్సం నిక్షేపం

న్యూఢిల్లీ, మార్చి 1: భారతదేశంలో 7 కోట్ల 40 లక్షల టన్నుల జిప్సం నిక్షేపమై వున్నదని తెలుస్తున్నది. అందులో 158 లక్షల టన్నులు మద్రాసులో వున్నదట.

## గత ఐదేళ్లలో 867 పన్ను ఎగవేత కేసుల పరిష్కారం

### రాబడిపన్ను పరిశీలన సంఘంవారి కృషి సమీక్ష

న్యూఢిల్లీ, మార్చి 1: రాబడిపన్ను ఎగవేత విచారణసంఘము 1952 సం॥ములో 206 కేసులు పరిష్కారం చేశారు.

1947 సం॥మున కమీషను యేర్పడింది. అప్పటినుంచి 1952 సం॥ అంతంవరకు కమీషనువారు మొత్తం 867 కేసులు పరిష్కరించినట్లు నేడు కమీషనువారు ప్రకటించిన నివేదికవల్ల తెలుస్తున్నది.

1948 సం॥ములో 4 కేసులు, 1949 సం॥ములో 101 కేసులు, 1950 సం॥ 232 కేసులు, 1951 సం॥ములో 324 1952 సం॥ములో 206 కేసులు కమీషనువారు పరిష్కరించారు. గొప్ప మొత్తాలు దాచిన కేసులను మాత్రమే చేపట్టడంవల్ల 1952 సం॥ములో పరిష్కారమైన కేసులసంఖ్య తగ్గింది.

1949 సం॥ములో పన్ను విధించదగిన 268 లక్షల రూపాయల ఆదాయాన్ని కమీషనువారు కనుగొన్నారు. దీనిపై పన్ను 218 లక్షల రూపాయలు కమీషనుకయిన ఖర్చు 8,63,669 రూపాయలు, పన్నులో ఖర్చు 100 కి 1.7 వంతులు.

1950 సం॥ములో కమీషనువారు దాచబడిన మొత్తం 811 లక్షల రూపాయలు కనిపెట్టారు. దీనిపై పన్ను 490 లక్షలు ఖర్చు రూ. 8,64,668 పన్నులో ఖర్చు 100 కి 1.7 వంతులు మాత్రమే.

1951 సం॥ములో దాచబడిన మొత్తం 1,812 లక్షల రూపాయలు కమీషనువారు కనుగొన్నారు. దీనిపై పన్ను 380 లక్షలు. ఖర్చు 8,30,514. పన్నులో ఖర్చు 9 వంతులు మాత్రమే.

1952 సం॥ములో రు. 1,68,91534 రూపాయలు దాచబడినట్లు కనిపెట్టారు. కాని పన్ను ఎంత విధించారో ఖర్చు యెంత అయిందో తెలిపే లెక్కలు యింకా లభ్యం కాలేదు.

1949, 50, 51 సం॥ములలో మొత్తం 657 కేసులు పరిష్కరించారు. రాబడిపన్ను అధికారుల నుండి దాచబడిన మొత్తం 2912 లక్షలు కనిపెట్టారు. ఈ మూడేండ్లకు మొత్తం ఖర్చు 28,60,520 రూపాయలు. గత సంవత్సరాలతో పోల్చిచూస్తే 1952 సం॥ములో రాజీపడ్డ కేసులు తక్కువగా వున్నాయి. పరిష్కారమైన 206 కేసులలో 143 మాత్రమే రాజీపడ్డకేసులు. 1950 సం॥ములో పరిష్కారమైన 232 కేసులలో 199 రాజీ కేసులు. 1951 లో పరిష్కారమైన 324 కేసులలో 275 రాజీకేసులు.

[illegible]

### కృష్ణానది [illegible]

[illegible]

### గంటల పంచాంగం

నందన సం॥ ఫాల్గుణ శు॥ తృతీయ
1953 సం॥ మార్చి 3 మంగళవారం
శు॥ తృతీయ 24-0 హస్త రా 2-19
వర్జ్యం ప 8-56 ల 10-43 కు.

శు॥ తృతీయ మార్చి 4 బుధవారం
శు॥ తృతీయ ఉ 7-41 చిత్ర తె 4-44
వర్జ్యం ప 11-7 ల 12-53 కు.




# ఆంధ్రపత్రిక

ఉరుశేయమి యొసగించిన పరవర యుప్రియము లేక మునంటిన కగు దా నౌరులకు వరిచేయుటని వరాయణము నరమధర్మపదముల కిలనే. (మహాభారతము)

నందన సం॥ ఫాల్గుణ శు॥ తృతీయ
మంగళవారం


## సిద్ధేశ్వరం ప్రాజెక్టు

రాయలసీమ ప్రాంతానికే ముందుగా కృష్ణనీరు ఉపయోగపడాలి నిత్యక్షామంతో, బాధపడుతున్న రాయలసీమ ప్రజల బాధా నివారణకు మూడు నాలుగు మాసాల్లో ఏర్పడనున్న ఆంధ్రప్రభుత్వం మొదటి విధి. ఈ విషయంలో భిన్నాభిప్రాయాలు లేవు. ఉండరాదు. వీటిని ఎలా సాధించగలం?

ఈ ప్రశ్నకు ఆంధ్రులు - రాయలసీమవారు, సర్కారు జిల్లాలవారు అనే విచక్షణను ఇప్పటికైనా మనం విరమించాలి-ఇచ్చే సమాధానాలు ఒకేరకంగా, ఒకటిగా ఉండకపోవచ్చు కాని రాయలసీమ ప్రాంత అభివృద్ధికి ఏ ప్రాజెక్టు ఎక్కువగా దోహదం చేస్తుందో, ఏ ప్రాజెక్టువల్ల వెనుకబడివున్న కర్నూలు, కడప జిల్లాలు శీఘ్రంగా అభివృద్ధి చెందగలవో శ్రద్ధగా విచారించడం అవసరం.

ఈ విచారణలో కర్నూలు, కడపజిల్లా ప్రజల అభిప్రాయాలకు ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వడం న్యాయం; సబబు.

చాగలమర్రిలో నిన్న శ్రీరామ లింగారెడ్డిగారి అధ్యక్షతను సమావేశమైన "కర్నూలుజిల్లా సిద్ధేశ్వరం ప్రాజెక్టు మహాసభ"లో ఆహ్వానసంఘ అధ్యక్షుడు, అధ్యక్షుడు నందికొండకు ముందు సిద్ధేశ్వరం ప్రాజెక్టునిర్మాణం జరగాలని కోరారు. ఆజిల్లా ప్రముఖులు పలువురు ఈవిధంగానే ఇదివరలో ప్రకటనలు చేశారు. క్రిందటి సంవత్సరం జగ్గయ్యపేటలో శ్రీ సంజీవరెడ్డిగారి అధ్యక్షతను జరిగిన నందికొండ ప్రాజెక్టు మహాసభలోకూడా ఇటువంటి సూచనచే చేయబడినది.

ఖోస్లా కమిటీ ప్రతిపాదనలు అంధికారికంగా వెలువడగానే కృష్ణ నదీలోయ అభివృద్ధి ప్రాజెక్టులలో సిద్ధేశ్వరంప్రాజెక్టుకే ప్రథమ స్థానం ఇవ్వాలని మేము సూచించాం. సిద్ధేశ్వరం ప్రాజెక్టు పూర్తి అయినందువల్ల రాయలసీమ ప్రాంతానికి లభించగల ప్రయోజనాలు, సుంకేశల ఆనకట్టను వృద్ధిచేసి, కడప, కర్నూలు కాలవను లోతు చేసి ఎక్కువ నీరు ప్రవహింపచేయడం వల్ల లభించగలవనే అభిప్రాయం ఒకటి వుంది. అయినా నందికొండ ప్రాజెక్టు నిర్మాణం పూర్తయిన తరువాత సిద్ధేశ్వరం ప్రాజెక్టును నిర్మించాలనే ఖోస్లా కమిటీ సిఫార్సు చేసింది. నందికొండ ప్రాజెక్టు పని జరుగుతూ వుండగానే సుంకేశల ఆనకట్ట, కడప-కర్నూలు కాలువ అభివృద్ధి చేయాలని ఖోస్లా కమిటీ సూచించింది. ప్రాజెక్టుల ప్రాధాన్య క్రమనిర్ణయంలో ఖోస్లా కమిటీ సిఫార్సులు కడప-కర్నూలుజిల్లా ప్రజలకు ఎక్కువ అసంతృప్తిని కల్గించినవి. ప్రస్తుతం కృష్ణలోయ అభివృద్ధి పథకం క్రింద నిర్మాణం కావలసిన ప్రాజెక్టుల త్రయం మద్రాసు, హైద్రాబాద్ ప్రభుత్వాల రివిశీలనలో వున్నవి. ఈ పరిశీలన పూర్తిగాకముందే ఆంధ్ర రాష్ట్రం ఏర్పడవచ్చును. ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం ప్రజాభిప్రాయాన్ని ఇంజనీర్ల సలహాలను, ప్రాంతీయావసరములను, అన్నింటిని గమనించే ఖోస్లా కమిటీ ప్రతిపాదనలనువునఃపరిశీలింపగలరు.

అయినా ఈ కృష్ణా-ప్రాజెక్టుల విషయంలో అంతిమ నిర్ణయం జరిగేవరకూ కడప-కర్నూలు ప్రజలు తమ కోర్కెలను పదేపదే దృష్టికి తెస్తూ, ఆందోళన చేయకతప్పదు. గతంలో రాష్ట్ర ప్రభుత్వాలు ఈ ప్రాంతం విషయంలో దూరదృష్టితో ప్రవర్తించనందున భవిష్యత్తును గురించి ఆందోళన చెందుతూవుండటం సహజమే.

ప్లానింగ్ కమిషన్ కూడా ఖోస్లా కమిటీ ప్రతిపాదనలపై రాష్ట్రప్రభుత్వాల పరిశీలన పూర్తిఅయినతరువాత ఒక నిర్ణయానికి వచ్చేముందు కడప, కర్నూలుజిల్లా ప్రజల విజ్ఞాపనలను శ్రద్ధగా, సానుభూతితో విచారించగలదని ఆశిస్తున్నాము.

## హైదరాబాదు మంత్రివర్గ పునర్నిర్మాణం

హైదరాబాదు మంత్రివర్గ పునర్నిర్మాణం ముఖ్యమంత్రి శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారికి ఒక విషమ సమస్యగా పరిణమించింది. ఒకసారి మంత్రివర్గాన్ని ఏర్పాటుచేసిన తరువాత, ఆ మంత్రివర్గంలో మార్పులు చేయడం అంత సులభంకాదు. మంత్రివర్గాన్ని విస్తృతం చేయడం సులభం కావచ్చును. కాని మంత్రుల సంఖ్యను తగ్గించి, మంత్రివర్గాన్ని కుదించి, ప్రభుత్వ సుస్థిరతకు భంగంరాని విధంగా తిరిగి ఏర్పాటుచేయడం ఎంత ప్రతిభావంతునికైనా కష్టమైన పనే.

హైదరాబాదులాంటి రాష్ట్రాన్ని పాలించడానికి పదముగ్గురుమంత్రులు అవసరమే కావచ్చు. మొన్న ముఖ్యమంత్రి రామకృష్ణరావుగారు పదముగ్గురు మంత్రులలోనూ ఇద్దరు మంత్రులకు ఆటే పని లేదని వెల్లడించారు. ఎన్నికలకు ముందు ఎనమండుగురే ఈ రాష్ట్రాన్ని పాలించారు అప్పటి మంత్రిమండలిలో శ్రీ రామకృష్ణరావుగారు కూడా వున్నారు. ఎన్నికలు పూర్తి అయినతరువాత మంత్రివర్గాన్ని ఏర్పాటు చేయవలసివచ్చినప్పుడు రాష్ట్ర పరిపాలనను సమర్థంగా, సంతృప్తికరంగా సాగించడానికిఎందరుమంత్రులు కావాలో రామకృష్ణరావుగారు గ్రహించియుండకపోవచ్చునని భావించలేకున్నాం. ఈనాడు మంత్రివర్గ పునర్నిర్మాణ సందర్భంలోవున్న సమస్యే, ఆనాడు మంత్రివర్గ నిర్మాణ సందర్భంలోనూ వుంది సమర్థత, సంతృప్తికరమయిన పరిపాలనతోబాటు మంత్రివర్గ సుస్థిరతను గూడా దృష్టిలో పెట్టుకొనే ముఖ్యమంత్రి ఈ పదముగ్గురితో మంత్రివర్గాన్ని ఏర్పాటు చేసియుండవచ్చును.

ఒక సంవత్సరం పరిపాలన అయినతరువాత, రాష్ట్రఅసెంబ్లీ మంత్రివర్గంలో విశ్వాసాన్ని ప్రకటించిన తరువాత హైద్రాబాద్‌కు ఇంతపెద్ద మంత్రివర్గం అవసరంలేదనే ఉద్యమం ప్రారంభమైంది. మనకి హైదరాబాదు వచ్చినప్పుడు ప్రధానమంత్రి నెహ్రూ ప్రకటించిన అభిప్రాయాలు యీ ఉద్యమానికి కొంతబలాన్ని చేకూర్చినవి.

అసెంబ్లీ కాంగ్రెసుపార్టీ యేర్పాటుచేసిన ఉపసంఘం అందరి అభిప్రాయాలనూ గమనించి మంత్రివర్గ సంఖ్యాబలాన్ని తగ్గించాలని సూచించింది ఈ తగ్గింపు మంత్రివర్గ బలాన్నే తగ్గించి వేస్తుందేమో అన్న విషయాన్ని ఉపసంఘం వారు విచారించినట్లు లేదు. ఆ ఉపసంఘ నివేదికను ఆమోదించిన కాంగ్రెసుపార్టీ కూడా అసలు సమస్యను అవగాహన చేసుకున్నట్లు కన్పించదు. ముఖ్యమంత్రి రామకృష్ణరావుగారు తమ రాజీనామాను ఉపసంహరించుకోవాలని కోరుతూ, ఉపసంఘ నివేదికను ఆమోదించడంలోనే కాంగ్రెసుపార్టీ ఒక ఖచ్చితమైన నిర్ణయానికి రాలేకపోయినదని స్పష్టమవుతున్నది.

కాంగ్రెసు అధిష్ఠానవర్గం కూడా మంత్రివర్గ సుస్థిరత దృష్ట్యా వ్యవహారం చేయడానికి రామకృష్ణరావుగారికి స్వాతంత్ర్యం ఇచ్చిందే గాని అసలు కాంగ్రెసుపార్టీ పునర్వ్యవస్థీకరణ గురించి శ్రద్ధ తీసుకోలేదు. హైద్రాబాదు అసెంబ్లీ డిప్యూటీస్పీకరు ఎన్నికలోనే కాంగ్రెసు పార్టీ వ్యవహారాలు ఉండవలసిన తీరుగా లేదని ధృవపడింది. తరువాత ప్రతిపక్షం ప్రతిపాదించిన విశ్వాసరాహిత్య తీర్మానం సందర్భంలో ముగ్గురు నల్గురు కాంగ్రెస్‌పార్టీ సభ్యులు ఎదురుపక్షంతో చేరిపోవడం యీ ప్రమాదతీవ్రతను వెల్లడించింది.

వీటన్నింటి ఫలితమే ఇప్పుడు మంత్రివర్గంలో ఏర్పడిన 'ప్రతిష్టంభన' ముగ్గురు మంత్రులు రాజీనామా ఇవ్వడంతో ఈ సమస్య పరిష్కారం కాలేదు. వారు ఆ రాజీనామాలను మనస్ఫూర్తిగా ఐచ్ఛికంగా ఇవ్వలేదని వారి ప్రకటనే వెల్లడిస్తున్నది. అసెంబ్లీ బడ్జటు సమావేశం ముందు ఈ విషమ పరిస్థితి ఏర్పడ్డం అత్యంత శోచనీయం. ముఖ్యమంత్రి ఈ మంత్రివర్గ పునర్నిర్మాణాన్ని బడ్జటు సమావేశం పూర్తి అయ్యేవరకూ వాయిదా వేసి యుండవచ్చును. అలా జరగలేదు. పరిస్థితులు విషమించకుండా చూడవలసిన బాధ్యత అటు అధిష్ఠానవర్గంపైనా, ఇటు హైద్రాబాదు ప్రదేశ కాంగ్రెసుపైనా కూడా సమంగానే వుంది. వారు బాధ్యతలను నిర్వర్తించే లోపున రాజీనామా నిచ్చిన మంత్రులు ఉదారంగా ప్రవర్తించగలరని విశ్వసిస్తున్నాం.

## డేహాట్ సూచన

(1 వ పేజీ తరువాయి)

వుంటుందన్నారు.

ఐసెన్ హోవర్ స్టాలినులు సమావేశం కావటం జరుగుతుందనే తాము ఆశిస్తున్నామనీ, అందువల్ల ప్రజాస్వామ్యాలు తమ సిద్ధాంతాలను పటిష్ట పరుచుకోవలసిన అవసరం వుందనే తమ అభిప్రాయమని కూడా డహాట్ అన్నారు. ఇటువంటి సమావేశం వల్ల అంతర్జాతీయ వ్యవహారాలలో ప్రధానంగా కనిపిస్తున్న అభిప్రాయ భేదాల నుకరించి కొరియా సమస్యను సమితి సిద్ధాంతాలను అనుగుణంగా పరిష్కరించడాన్ని సురంభీ స్టాలిన్‌తో సమగ్రంగా చర్చించే సావకాశం కలుగుతుందని కూడా వారు అన్నారు.

## అది, ఇది, అవీ

కేంద్ర ఆర్థికమంత్రి శ్రీ చింతామణి దేశముఖ్ శుక్రవారం సాయంత్రం బడ్జెట్ ప్రతిపాదనలను వెల్లడించారు.

తర్వాత రెండురోజులకు ఆంధ్ర ప్రదేశ కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీనీలం సంజీవరెడ్డిగారు తమ 'కొత్త' కార్యవర్గాన్ని ప్రకటించారు.

ఆమర్నాడు హైదరాబాదు ముఖ్యమంత్రి శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు తమ 'కొత్త' మంత్రివర్గాన్ని ఏర్పాటు చేసుకున్నారు.

* * *

ఆర్థికమంత్రి శ్రీ దేశముఖ్ డబ్బువిషయంలో ఎంత జాగ్రత్తగా వ్యవహరించారో...

హైదరాబాదు ముఖ్యమంత్రి, ఆంధ్రప్రదేశ కాంగ్రెసు అధ్యక్షుడూ అంత జాగ్రత్తగానూ వ్యవహరించారు.

ఉన్న పన్నులను అటు, ఇటుగా సర్దుబాట్లుచేసి యథాస్థితికి భంగంరాని విధంగా శ్రీ దేశముఖ్ 1953-54 బడ్జెట్ తయారుచేశారు.

అలాగే శ్రీ సంజీవరెడ్డిగారు ఉన్న మనుష్యులలోనే, కొద్ది సర్దుబాట్లు చేసి, తమ కార్యవర్గాన్ని తయారుచేశారు.

హైదరాబాదు ముఖ్యమంత్రి కూడా పోతామన్నవారిని వట్టుకోక, శేషించినవారితోనే మంత్రివర్గాన్ని సర్దుబాటు చేశారు.

* * *

శ్రీ దేశముఖ్ తయారుచేసిన 1953-54 బడ్జెట్ ప్రభావం కేవలం డబ్బులావాదేవీలమీదనే గాక మనుష్యుల లావాదేవీలపై కూడా వున్నట్లు కనిపిస్తున్నది!

అందుకే శ్రీమతి దుర్గాబాయమ్మగారు ఈ బడ్జెట్‌ను "పీపుల్సు బడ్జెట్" అన్నారు.

* * *

కమ్యూనిస్టుపార్టీ ఆంధ్రశాఖ నాయకుడు చండ్ర రాజేశ్వరరావుగారు ఆంధ్ర రాజధానిపై నూజివీడు సభలో అనర్గళంగా ఉపన్యసించారు.

కాంగ్రెసు నాయకులు కమ్యూనిస్టులపై చేస్తున్న ఆరోపణలకు అనుమానాలే ఆధారంగాని, వాటికి ఇతర ఆధారాలు ఏవీ లేవన్నారు.

ఆ అనుమానాలకు ఆధారాలేమిటో మాత్రం చెప్పలేదు. ప్రజలకు తెలిసే వుంటుందని వదిలివేసి వుండవచ్చు.

ఆ అనుమానాలు ఏమిటని బహుశః సభ్యులలో ఎవరైనా ప్రశ్నించి వుండవచ్చు! ఆ ప్రశ్నకు ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీ "సి. ఆర్" ఇలా సమాధానం ఇచ్చారు:

"విజయవాడను రాజధానిగా చేసి, నూజివీడులో ఆఫీసులు పెడితే ఆ పరిసరాలలోని కొండలు కమ్యూనిస్టు గెరిల్లాలకు బాగా ఉపయోగపడగలవని కొందరు అంటున్నారు. "కమ్యూనిస్టులను అలా అనుమానించక, ఉపయోగ అనుపయోగాలనే ఆలోచించడం మంచిది."

కాంగ్రెస్ వారు ఇంతవరకూ ఉపయోగాలనే ఆలోచించారు గాని అనుపయోగాలను ఆలోచించలేదు.

ఇతరులకు ఉపయోగంగా వుంటే తమకు అనుపయోగంగా వుంటుందని వారు భావిస్తుండవచ్చు.

ఆలోచించగా నూజివీడు కొండలు కమ్యూనిస్టు గెరిల్లాలకు కాకపోయినా, గెరిల్లా కమ్యూనిస్టులకు ఉపయోగంగా వుంటవని కాంగ్రెస్ వారికి తోచింది.

కనుక తమకు అనుపయోగంగా, నిరుపయోగంగా వుంటుందని కాంగ్రెస్ వారు భావించారు.

కనుక కాంగ్రెస్ వారు ఉపయోగానుపయోగాలను బొత్తిగా ఆలోచించలేదని కమ్యూనిస్టు పార్టీ "సి. ఆర్" ఆరోపించరాదు!

* * *

"కమ్యూనిస్టుపార్టీని అణచాలంటే, ఆ పార్టీ ఏంచెబితే అది చేయడంకంటే అన్యమార్గంలేద"ని శ్రీ రాజేశ్వరరావు అన్నారు.

అలాగైతే కాంగ్రెస్ చెప్పినట్లు చేసి కాంగ్రెస్‌ను అణచివేయడానికి 'కమ్యూనిస్టు గెరిల్లాలు' ఎందుకు ప్రయత్నించకూడదు?

బహుశః ముందు కాంగ్రెస్ వారు కమ్యూనిస్టుపార్టీ చెప్పినట్లు చేసి ఆ పార్టీని అణచివేస్తే, తదనంతరం "కమ్యూనిస్టులు" కాంగ్రెస్‌పార్టీ చెప్పినట్లు చేసి ఆ పార్టీని అణచివేస్తారేమో?

అయితే, కమ్యూనిస్టులు చెప్పినట్లు చేస్తే రెండుపనులు ఒక్కదెబ్బలో పూర్తి కావచ్చు! కమ్యూనిస్టులు చెప్పినప్రకారం కాంగ్రెస్ వారు "ఆత్మహత్య" చేసుకుంటే, కమ్యూనిస్టుపార్టీని అణచివేయ గల్గుతారు! (రాజేశ్వర రావుగారి కొత్త థీసిస్ ప్రకారం.)

* * *

నూజివీడు సభలోనే శ్రీ రాజేశ్వరరావు రాజధాని విషయమై ఆంధ్రులు ఏం చేయాలో సూచించారు: "మదరాసు మనకువస్తు అనీ, హైద్రాబాదు మనకు కావాలని మనం ఆందోళన చేయాలి."

ఉపయోగాలతో బాటు అనుపయోగాలను కూడా ఆలోచించినట్లే, కావలసినవాటితో బాటు అక్కరలేనివాటని గురించికూడా ఆందోళన చేయాలి!

అప్పుడు ఈ ఆందోళన చేస్తున్నవాటిలో ఏదినా ఏ ఒకటైనా దక్కుతుంది!

# పది మంత్రులతో హైదరాబాద్ మంత్రివర్గ పునర్నిర్మాణం

## ముగ్గురు సహచరులు వైదొలగినందుకు ముఖ్యమంత్రి విచారం

హైద్రాబాద్, మార్చి 1: హైద్రాబాదు మంత్రివర్గంలో పదిమంత్రుల పేర్లను ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణరావుగారు ఈనాడ పత్రికావిలేఖరుల సమావేశంలో ప్రకటించారు. శ్రీయుతులు వి. బసవరాజు, ఫూల్‌చంద్‌గాంధీ, జగన్నాథరావు చందార్కీగారల రాజీనామాలను రాజప్రముఖ్ అంగీకరించారనికూడా రామకృష్ణరావుగారు విలేఖరుల సమావేశంలో వెల్లడించారు.

ఈవిధంగా తగ్గించబడిన హైద్రాబాద్ మంత్రివర్గంలో ఇకముందు పదిమంది మంత్రులు మాత్రమే వుంటారు. వారి పేర్లివి: 1. ముఖ్యమంత్రి శ్రీబూర్గుల రామకృష్ణరావు, 2. శ్రీ డి. జి బిందు 3. వెంకట రంగారెడ్డి, 4. డాక్టర్ ఎమ్. చెన్నారెడ్డి, 5. శ్రీ వినాయకరావ్ విద్యాలంకార్, 6. డాక్టర్ జి. హెచ్. మేల్కోటే, 7. శ్రీ అన్నారావ్, 8. శ్రీ దేవీసింగ్ చౌహాన్, 9. నవాబ్ మొహిద్దీన్ నవాజ్ జంగ్, 10 శ్రీ శంకర దేవ్.

ముఖ్యమంత్రి రామకృష్ణారావుగారు పత్రికావిలేఖరుల సమావేశంలో ఇంకా ఈ విధంగాకూడా తెలియజేశారు.

"ఏ శాఖను వదలివెయ్యాలనే విషయంగురించి ఇంకా సంప్రతింపులు జరుగుతున్నవి. ఆ విషయం రేపు ప్రకటించబడగలదు. డిప్యూటీమంత్రులను, పార్లమెంటరీ కార్యదర్శులను నియమించే ఆలోచన ప్రస్తుతానికిలేదు.

"క్రిందటి మార్చి నెలలో పాత మంత్రివర్గం ఏర్పడ్డది. మంత్రివర్గసభ్యులు ఇంతమందెందుకనేవిషయం అప్పటి నుంచీ విమర్శించబడుతున్నది. పార్టీ సభ్యులు తదితరులుకూడా ఆ విధంగా విమర్శిస్తున్నారు. ప్రజలుకూడా ఇంతమంది మంత్రులెందుకని విమర్శించారు.

"మంత్రివర్గమేర్పడి కొంతకాలం పనిచేసి సత్ఫలితాలుసాధిస్తే ఈవిమర్శ అంతరించిపోతుందని వ్యక్తిగతంగా నేను భావించాను. కాని అనేక కారణాలవల్ల ఆ విమర్శకు బలం చేకూరింది. గత కొద్ది నెలల్లో ఆ విమర్శ మరీ ఎక్కువయింది. క్రిందటిసారి శాసన సభ సమావేశమైనప్పుడు కాంగ్రెసు మంత్రివర్గ కార్యకలాపాల సమీక్షకు పార్టీ ఒక ఉపసంఘం నియమించింది. కాంగ్రెసుసంఘాలు పార్లమెంటరీ కార్యకలాపాల దృష్టితో చేసిన పనులు సమీక్షించడంకూడా ఆ వుపసంఘం యొక్క ఆశయం.

"కొంతమంది మంత్రులను, పార్లమెంటు సభ్యులను, శాసనసభ్యులను ఆవుపసంఘంవారు విచారించి సాక్ష్యం సేకరించారు. ఆ తరువాత ఆ సంఘంవారు కొన్ని సూచనలుచేశారు. మంత్రివర్గంలోని మంత్రులను తగ్గించడం ఆ సూచనలలో ఒకటి. ఎక్కువమంది మంత్రులుండడంవల్ల కలిసి మెలిసి సమగ్రంగా, సవ్యంగా పనిచెయ్యడం సాధ్యం కావడం లేదని ఆ విమర్శించేవారు, మంత్రులను తగ్గించాలని చెప్పేవారు, ఆ వుపసంఘంవారు అంటున్నారు. మంత్రులను తగ్గించాలనడానికి వారు చెప్పే కారణాలలో ఆదొకటి. మంత్రులను తగ్గించినట్లయితే మంత్రివర్గం సమర్థంగా పనిచేయగలదని ఆ వుపసంఘంవారు సూచించారు. ఈ సూచన కాముచేసిన పలహాలన్నింటిలో ముఖ్యమైందని ఆ వుపసంఘంవారి నివేదికను తయారుచేసిన వారి అభిప్రాయం. పైగా పార్టీ చర్చలలో అది ప్రాముఖ్యం వహించింది."

### అనవసరమైన విమర్శ

మంత్రివర్గంలోనిమంత్రులసంఖ్యను గురించి జరిగిన విమర్శ అనవసరమైందనీ, దానిని గురించి అన్యాయపు టారోపణలు చేయబడుతున్నవనీముఖ్యమంత్రి ఆయన అనుయాయులు భావించారు. పార్టీసభ్యులు, తదితరులు కూడా ఈ విషయం గురించి అనవసరంగా విమర్శించుతున్నారని మంత్రులు అభిప్రాయపడ్డారు. తమ పదవులకు రాజీనామా లివ్వడమే కర్తవ్యమనివారుభావించారు. సమిష్టిగా అందరు రాజీనామాచేసి మంత్రివర్గాన్ని పునస్సంఘటించే అవకాశం పార్టీకి యివ్వడమే సమంజసమని వారు భావించారు.

ముఖ్యమంత్రి రామకృష్ణారావుగారు ఈ సందర్భంలో యింకా యిలా అన్నారు.

"పార్టీ సమంజసమని తలచినట్లయితే కొత్తనాయకుని ఎన్నుకొనేందుకు వీలుంటుందని నేను వ్యక్తిగతంగా భావించాను. కాని కొన్ని బాధలపాటు దానివిషయం గురించి చర్చ జరిగినా (కనీసం పార్టీలో యొక్కవ మందయినా) నేను రాజీనామా ఉపసంహరించుకోవాలని పార్టీ అభిప్రాయపడింది. పార్టీని బలపరచడానికి, మంత్రివర్గాన్ని సంస్కరించడానికి నేనే ఎలాచేసినా సరే నన్ను బలపరచాలని కూడా పార్టీలో యొక్కవ మంది అభిప్రాయపడ్డారు. పార్టీ యీవిషయం గురించి చేసిన తీర్మానంలో "ఉపసంఘం చేసిన సూచనల దృష్ట్యా" అని కూడా చేర్చబడింది.

"ఈవిషయంలో నేను తీసుకోవలసిన బాధ్యతనుగురించి ఆలోచించాను. మంత్రులను తగ్గించి, మంత్రివర్గంలో కొంతమంది మంత్రులు యెందుకు అనే విమర్శను తగ్గించాలనే నిర్ణయానికి వచ్చాను. మంత్రివర్గంలో నిన్న కొందరు మిత్రులు నా యీ సూచనకు వ్యతిరేకించారు. మంత్రులను తగ్గించవలసిన అవసరమేమీ లేదంటే లేదన్నారు. ఈవిషయం గురించి వారితో నేనుఅనేక చర్చలుజరిపి వారి అభిప్రాయాలు తెలుసుకొని, నాఅభిప్రాయాలు వారికి చెప్పాను. అయినా నేను వారితో ఏకీభవించలేక పోయినాను. తత్ఫలితంగా ఈవిషయంలో వారు నాతో యేకీభవించలేక పోయినారు.

"మొదట ఇద్దరుమంత్రులను తగ్గిద్దామనుకున్నాను. వాస్తవానికి వారికంతపనికూడా ప్రస్తుతంలేదు. మంత్రివర్గంలోని ఇతరమంత్రులకువారుపనిచేసినా మంత్రివర్గం సౌష్ఠవానికిగాని, నాయ చేసే పనికిగాని పెద్దఇబ్బంది కలిగివుండేదికాదు. ఈసూచన కూడా నా పాతమంత్రులతో కొందరికి అనేక కారణాలవల్ల నచ్చలేదు.

"ఒక నెలక్రిందట తమ పదవులకు రాజీనామాలిచ్చిన ముగ్గురుమిత్రులకు నాయీసూచన నచ్చేఅవకాశం కనిపించలేదు. అందుచేత ఎంతో అయిష్టతతో వారి రాజీనామాలను రాజప్రముఖుకు నేను అందజేయవలసి వచ్చింది.

"ఇప్పటి నాయీచర్య చాలా అదరణయోగ్యమైందనీ, ఇంతవరకు పరిపాలనా వ్యవహారాలలో నాకు హృదయపూర్వకంగా విశేషంగా తోడ్పడిన వారి సేవలను కొత్త మంత్రివర్గంలో నుంచి తొలగించరాదనే నా కోరిక. అటువంటి సహకారం ఇంకా నాకు కావాలని నేను స్పష్టం చేస్తున్నాను.

"ఉపసంఘం సూచించినట్లు మంత్రుల సంఖ్యను తగ్గిస్తే పరిపాలనా సౌష్ఠవం, పార్టీ భద్రత దెబ్బతింటుందని నాకు తెలుసు. అందుచేతనే పరిపాలనలో విశేషానుభవం గల ఫూల్‌చంద్ గాంధీ, బసవరాజు గారలు ఇక ముందుకూడా మంత్రివర్గంలో వుండాలని నేను వారిని కోరడం జరిగింది.

"నా నివారి ఇష్టానికి వ్యతిరేకంగా బలవంతంగా మంత్రివర్గంలో వారిని అట్టే పెట్టలేక పోయినాను. వారినుంచి విడిపోవడం నిజంగా నాకు బాధగానే వున్నది. వారికీ బాధగానే వుంటుంది.

### మంత్రివర్గంలో అభిప్రాయ భేదాలు లేవు

"మంత్రివర్గంలో అనేక అభిప్రాయభేదాలు వున్నట్లు ఒక సంవత్సరంనుంచి బయలుదేరిన వదంతులలో సత్యంలేదని నేను స్పష్టంగా చెబుతున్నాను. విభేదాలున్నప్పుడు మొదలయినవి ఉండడంసహజమేఅయినా మంత్రివర్గం కలిసి పనిచెయ్యడానికి అవేమీ అడ్డు రాలేదనడం సమంజసం. మనసులో ఏకలంకలు పెట్టుకోకుండా అందరంకలసి పనిచేశాం. ఇప్పుడు కొందరు మిత్రులను వదిలి పనిచెయ్యడం నిజంగా నాకు బాధగావున్నది. కాని, పార్టీకోరికను దృష్టిలో పెట్టుకొనే ప్రస్తుతం మంత్రుల సంఖ్యను తగ్గించడం జరిగిందని స్పష్టం చేయగోరుతున్నాను. ఇప్పుడు మంత్రి పదవులనుంచి విరమించుకున్న ముగ్గురు మిత్రులు ఇకముందుకూడా పార్టీ సభ్యులుగా తమతో పూర్తిగా సహకరించగలరన్న నా ఆశ. వారికి నా కృతజ్ఞతాభివందనలు.

### శ్రీ రామానందతీర్థ వ్యాఖ్య

సికిందరాబాద్, మార్చి 1: హైద్రాబాద్ మంత్రివర్గ పునర్నిర్మాణం గురించి ప్రదేశ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ రామానందతీర్థ వ్యాఖ్యానిస్తూ ఈ రాత్రి ఇలాఅన్నారు:

"మంత్రివర్గ పునర్నిర్మాణం పనికిరాదని మొదటనుంచీ నాఅభిప్రాయం. ముఖ్యంగా యీ పరిస్థితులలో హైద్రాబాద్ మంత్రివర్గ పునర్నిర్మాణం ఎంతమాత్రం పనికిరాదనే నా అభిప్రాయం. ఏమైనా ఈ సమస్య యిలా పరిణమించడం నాకేమీ బాగా లేదు". పి. టి. ఐ.

### వి. బి. రాజు, ఫూల్‌చంద్ గాంధిగారల విమర్శ

హైద్రాబాద్, మార్చి 1: "ఏ ప్రాథమిక సూత్రాలనుపరించిగాని, ఉపసంఘం చేసిన సూచనల ననుసరించిగాని, శాసనసభ కాంగ్రెసుపార్టీచేసిన నిర్ణయంప్రకారం మంత్రివర్గ పునర్నిర్మాణం జరుగలేదు. కనుకనే మంత్రివర్గంలో వుండడానికి మేమునిరాకరించాము" అని హైద్రాబాద్ మంత్రివర్గ పునర్నిర్మాణంగురించి ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావుగారు పత్రికావిలేఖరుల సమావేశంలో చేసిన ప్రకటనను వ్యాఖ్యానిస్తూ తమ పదవులకు రాజీనామాలిచ్చిన బసవరాజు, ఫూల్‌చంద్ గాంధీ గారలు అన్నారు.

మరి ఇద్దరు మంత్రులను తొలగిస్తేనే గాని తాము మంత్రివర్గంలో వుండమంటూ వారిద్దరు ఇంకా యిలా అన్నారు:

"పటిష్ఠమైన మంత్రివర్గం ఏర్పాటు చేసే విషయంగురించి అనేక చర్చలు జరిగినవి.

అనేకసూచనలుచేయబడినవి. సర్వసాధారణంగా జరిగినది మాత్రం వాటన్నింటికీ పూర్తిగా విభిన్నంగా వుంది.

"మీ నలుగురిలో ఎవరు రాజీనామా లిచ్చేది మీరే నిర్ణయించమంటూ ముఖ్యమంత్రి రామకృష్ణరావుగారు మాకు, జగన్నాధరావు చందార్కీ, దేవసింగ్ చౌహాన్ గారలకు జాబు వ్రాయడం ప్రజాస్వామిక సంప్రదాయాలన్నింటికీ పూర్తిగా వ్యతిరేకం.

"ఈ విధంగా ఎక్కడా, ఎప్పుడూ జరగలేదు. పార్టీ నాయకుడు పార్టీలో చిన్నవర్గంవారిని మీలో ఎవరు రాజీనామా లివ్వవలసిందీ మీరే నిర్ణయించమని అడగడం ఏప్రజాస్వామిక దేశంలోనూ ఎన్నడూ జరగలేదు. ఈవైఖరిని మేము వ్యతిరేకించాం. కనుకనే ఈ సూచన మంచిది కాదన్నాం. అందువల్లనే మంత్రివర్గంలో మేము వుండరాదని నిర్ణయించుకున్నాం.

"మంత్రివర్గంలో ఎవరుండాలి, ఎవరుండరాదనే విషయాలను పార్టీనాయకుడు నిర్ణయించాలి. పార్టీసభ్యులు ఆ విషయం నిర్ణయించరాదు.

"శ్రీ దేవసింగ్ చౌహాన్ గారిని మంత్రివర్గంనుంచి తొలగించాలని ముఖ్యమంత్రి లోగడ భావించారు. ఇప్పుడాయనను ముఖ్యమంత్రి తన మంత్రులలో అట్టిపెట్టుకోవడం ఆశ్చర్యంగా వున్నది."

శ్రీ దేవసింగ్ చౌహాన్‌ను మంత్రివర్గంలో ముఖ్యమంత్రి ఏపద్ధతి ననుసరించివుంచారో తెలియదు.

బసవరాజు, ఫూల్‌చంద్ గాంధీగారలు ఈ సందర్భంలో ఇంకా యిలా అన్నారు:

"నిజాయితీగలవారితో పటిష్టమైన మంత్రివర్గమేర్పరచాలనే కాంగ్రెసు పార్టీ నిర్దేశించింది. మంత్రులను తగ్గించడం ముఖ్యవిషయంకాదు. ఇందుకనుగుణంగా మంత్రులందరి రాజీనామాలను రాజప్రముఖ్‌కు పంపించి, కొత్తమంత్రులను నియమిస్తూ ఈ తగువులు పంపించవలసింది. రాజప్రముఖ్ మా రాజీనామాలను అంగీకరించిన విషయం ముఖ్యమంత్రి పత్రికా విలేఖరుల సమావేశంలో చేసిన ప్రకటనవల్లనే మాకు తెలిసింది. అంతకు ముందావిషయం మాకు తెలియచేయబడలేదు."

# హైద్రాబాద్ మంత్రులు; వారి శాఖలు; ముఖ్యమంత్రి ప్రకటన

సికింద్రాబాద్, మార్చి 2: పరిపాలనా, సమాచార, భూమి సంస్కరణశాఖల తనవద్ద అట్టిపెట్టుకొంటూ మిగతా శాఖలను మిగతా తొమ్మిదిమంది హైద్రాబాదు మంత్రులకు కేటాయిస్తూ ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావుగారు ఈ వేళ ఒక ప్రకటన చేశారు.

ఆ పునర్విభజన వివరాలివి: (1) శ్రీ డి. జి. బిందు-హోమ్, లా, శాంతిభద్రతల పునరావాసశాఖలు; (2) శ్రీ రంగారెడ్డి-రెవిన్యూ, ఎక్సైజ్, కస్టమ్స్, అడవుల నిర్వహణశాఖలు (3) డాక్టర్ ఎమ్. చెన్నారెడ్డి-ఆహార, వ్యవసాయ ప్లానింగు శాఖలు (4) నవాబ్ మొహిద్దీన్ నవాజ్ జంగ్-పబ్లిక్ వర్క్సు, వైద్యం, ప్రజారోగ్య శాఖలు (5) శ్రీ వినాయకరావు విద్యాలంకార్-వాణిజ్యం, పరిశ్రమలు, కార్మిక శాఖలు (6) డాక్టర్ జి. ఎస్. మేల్కోటే-ఆర్థిక, స్థానిక స్వపరిపాలన శాఖలు; (7) డాక్టర్ దేవసింగ్ చౌహాన్-గ్రామాభ్యుదయ, విద్యాశాఖలు; (8) శ్రీ అన్నారావ్-స్థానిక పరిపాలనాశాఖ; (9) శ్రీ శంకరరావుదేవ్, సాంఘిక సేవావిభాగశాఖ.

## సంపాదకునకు లేఖలు

### 'లెవెల్ క్రాసింగుకు అనుమతించాలి'

ఆర్యా, భీమవరం 12 వార్డులో మీటరుగేజి రైల్వేలైను అవతలగా సుమారు మూడువేలమంది బసులు నివసిస్తున్నవి. వారికి పి. పి. రోడ్డునుంచి హరిజన ఠాకూరుగారి సిరిసుండా నడిమార్గమువద్ద లెవెల్ క్రాసింగును అనుమతించాలనీ, అందు కమ్యూనిష్టు తామే భరించుతామనీ, మున్సిపాలిటీవారు రైల్వేవారికి తెలియపరచటం, జరిగినది. కాని నాలు నెలలైనా యింతవరకు యేమీ జరుగలేదు, కనుక వెంటనే యేర్పాటుకు అనుమతించ వలసిందిగా రైల్వేవారిని కోరుతున్నాను.

భీమవరం, ఉప్పలపాటి శేషయ్య.

* * *

### ఆయుర్వేద వైద్యాభివృద్ధి

ఆర్యా, దేశీయ వైద్యశాలలను గురించి తమ పత్రికలో యిటీవల ప్రచురింపబడిన లేఖలోని విషయములు సమ్మతములుకావు. ఆయుర్వేదం నాటికీ శస్త్రచికిత్సకు దూరమై, కాయచికిత్సలోనే అభివృద్ధిచెందినది. పూర్వవైద్యుల్లోతూము రావడెవన్న తిరిగి ఆయుర్వేదములో ప్రస్తుతమున్న లోపములను సవరించుకొనగలను. పురాణకాలపు ఆయుర్వేద గ్రంథములనే అంటిపెట్టుకుని వుండక ఆధునిక శాస్త్రములయందలి విషయములను కూడ గ్రహించి వినియోగించుకోవలెను. సంకుచిత భావములవలీ, ఉనను ప్రస్తుతమున్న దేశీయ వైద్య సౌకర్యప్రణాళికను బలపరచవలెను.

ఏలూరు, మారెళ్ళ కృష్ణారావు.

* * *

### ఒరిస్సా కౌలుదార్ల రక్షణచట్టం

ఆర్యా, పైచట్టము గుంటూరు వంటి చోట్లలో తీవ్రముగా అమలు జరుగుచున్నది. భూస్వాములు, కౌలుదార్ల వివాదపడిన సందర్భములలో కోర్టువారు పరిష్కరిస్తున్నారు. చట్టంలోని 6 వ సెక్షను ప్రకారం మూర్ఖ పోలం నుంచి కౌలుదారు భూస్వామికి భాగం యివ్వవలసియున్నాడు. అటు వంటప్పుడు భూస్వామి కౌలుదారుకు తెలియజెప్పకుండా పంట ఎలా తీసుకోవగలడు? పైగా చట్టంలోని 6, 10 సెక్షనులకు సమన్వయం కుదురుటలేదు. కనుక వీటిని స్పష్టంచేస్తూ, 88 ఎకరాలకు ఈ చట్టం వర్తించిందని ప్రకటించవలసినదిగా ఒరిస్సా ప్రభుత్వము వారిని వేడుకొంటున్నాను.

ప్రజారాజు సత్యనారాజు, గుణుపూరు. కార్యదర్శి, గుణుపూరు తాలూకా రైతురక్షణ సమితి.

## ఆంధ్రలో టెలిఫోన్ సౌకర్యాల అభివృద్ధి

(1 వ పేజీ తరువాయి)

కొత్తబోర్డుల్ని పెడ్తారు; రాజమండ్రిలో ఇంకో 100 లైన్లు ఇవ్వటానికి బోర్డును పెడ్తారు, విశాఖపట్నంలో 300 లైన్ల జోడుబదులు 500 లైన్ల బోర్డును పెడ్తారు. విజయవాడలో కొన్నికొన్ని సౌకర్యాలకోసం చిన్న మొత్తాన్ని ప్రత్యేకించారు,

### "పబ్లిక్ కాల్" ఆఫీసులు

కదిరి, కొత్తగూడెం, అదిలాబాదు, రాయగడ, ప్రొద్దుటూరు, ఆదోని, పుత్తూరు, రేణిగుంట, తిరుత్తనిలలో "పబ్లిక్ కాల్" ఆఫీసులను (పి. సి. ఓ. లు) నెలకొల్పటానికి గూడా ఖర్చులో తీసు వేశారు. ఇందులో ప్రొద్దుటూరును కర్నూలు, నంద్యాలలతో, అదిలాబాదును చాందాతో, ఆదోనికి రాయచూరుతో, తిరుపతి చిత్తూరులను ట్రంకులైనుతో కలపటం ద్వారా రేణిగుంట పుత్తూరు, తిరుత్తనులకు, ట్రంకుసంబంధం కలగజేస్తారు.

ఇవిగాక హైదరాబాదులో టెలిఫోను సౌకర్యాలను అభివృద్ధి చేయటానికి, సికింద్రాబాదు-కాజీ, సికింద్రాబాదు-వాంకిడి, గుంతకల్లు బెంగుళూరు వద్ద ట్రంకులైనును అభివృద్ధి చేయటానికిగూడా డబ్బును ప్రత్యేకించారు.

విశాఖపట్నంవద్దగల విదేశాలకు తంతి సౌకర్యాలను ఎక్కువ చేయటానికి ఒక రేడియోస్టేషన్ను గూడా కట్టటానికి ఏర్పాటుచేశారు.

### భవన నిర్మాణాలు

ఈ క్రింది నిర్మాణాలకు కూడా అంచనాలు వేశారు. మద్రాసులో పోస్టుమాస్టర్ జనరల్ ఆఫీసు, నెల్లూరు పోస్టుఆఫీసు, విజయవాడలో టెలిఫోన్ ఆఫీసు, విశాఖపట్నంలో డివిజనల్ ఇంజనీరు ఆఫీసు, మద్రాసులో సెంట్రల్ టెలిగ్రాఫ్ ఆఫీసు, సికింద్రాబాదులో అకౌంటెంట్స్ ఆఫీసు, నెల్లూరు గుంటూరు ఏలూరులలో క్వార్టర్లు, విజయవాడ ఏలూరు పోస్టు ఆఫీసు భవనాలకు అవసర మరమ్మత్తులకు కూడా డబ్బును ప్రత్యేకించారు. మద్రాసులో ఎయిర్ మెయిల్ హాండ్లింగ్ షెడ్డుకి, గుంతకల్లులో రైల్వే మెయిల్ సర్వీసువారికి గూడా క్వార్టర్లు కట్టటానికి ధనం ప్రత్యేకించారు.

## పంచాయతీ ఎన్నికల ఫలితాల వివరాలు

### పేరుసోముల
(కోవెలకుంట్ల తాలూకా)

కోవెలకుంట్ల, మార్చి 2: అధ్యక్షులు ఎం. అంకిరెడ్డి. సభ్యులు నారాయణరెడ్డి, సి. ఫిలిప్స్, రహీం తుల్లా సాహెబ్, వెంకటరామయ్య, కంబన్న, పి. కొండారెడ్డిగార్లు.

### దొర్నిపాడు

అధ్యక్షులు లక్ష్మీనారాయణరెడ్డి. సభ్యులు చిందుకూరు తిరుపలియ్య, పగడాల శేషిరెడ్డి, గీదా సుబ్బారెడ్డి, కొకన్న, గీదా పుల్లారెడ్డి, కొకనూరు చిన్న గురురెడ్డిగార్లు.

### అముజూరు (తూ. గో. జిల్లా)

అధ్యక్షులు కోడూరి వెంకట్రాయుడు. సభ్యులు ఎనుముల వీరవెంకట్రావు చౌదరి, గన్ని పనస రామన్న, కవలి వెంకన్న, ముండపల్లి చిట్టెలు, సీతాని సుబ్బారావు, కురువాడ సత్యనారాయణ గార్లు.

## భద్రాచలం యాత్రికులకు హెచ్చరిక

కాకినాడ, ఫిబ్రవరి 28: శ్రీరామనవమి ఉత్సవములకు భద్రాచలం వెళ్లదలచిన యాత్రికులందరూ, మశూచి, కలరా మున్నగు వ్యాధులు సోకకుండా ఉండేందుకు టీకాలు, కలరా ఇంజక్షన్‌లు వేయించుకొని యాత్రకు వెళ్లవలెనని, టీకాలు, కలరా మందులు ప్రతి ఆస్పత్రిలోనూ, ఉచితముగా లభించునని, తూర్పుగోదావరి ఏజెన్సీ జిల్లాబోర్డు కార్యాలయంవారు హెచ్చరిస్తున్నారు.

## మదరాసు ధరలు

మదరాసు, మార్చి 2:

బంగారు-వెండి చేటిమధ్యాహ్నం 3 గంటకు సవరను 1-కి ఎడ్వర్డుబొమ్మ సెల్యుటాక్సుతో సహా రు. 59-4-0

| | |
|---|---|
| పెట్టాబంగారు తులం | రు. 90-12-0 |
| కూసు బంగారు | రు. 89-2-0 |
| సీమవెండి తులం100 కి రెడి | 170-0-0 |

### వేరుశనగ:

(581 పా॥ 1-కి ఎక్స్‌కోస్తా గిడ్డంగులు కెమిన్- సేల్సుటాక్సుతో సహా)

| | |
|---|---|
| కొత్త సరకు | రు. 183-0-0 |
| వేరుశెనగనూనె ఎక్స్‌పెల్లర్ | విలో 8% |
| (500పా.) రెడి విల్లరధర | రు. 878 |
| వెంకొయనూనె (87½ పౌనులు గల) | |
| అంబుమూర్కు | రు. 84-0-9 |
| ఎం.ఎస్. (బ్రాండ్ డబ్బా | 84-0-9 |
| ఎవరెస్టు | ,, రు. 88-8-9 |
| పెలం లోటస్ ప్యాన్ (బ్రాండ్ 87½పా. | రు. 26-0-9 |

మణిలాంకురు కెచర విపరీతంగా పెరిగింది.

### చమురు

600 పౌనులు గల కారును ఒకటికి

| | |
|---|---|
| తిరుపత్తూరు | రు. 340-0-0 |

### పంచదార

| | |
|---|---|
| ఉయ్యూరు / కొల్ప్ట్స్ / సీతానగరం / పెద్దాపురం | రు. 87-8-9, 88-0-9 |

### బొంబాయి మార్కెట్

బొంబాయి, మార్చి 2:

నేటిమధ్యాహ్నం 2 గంటలకు బొంబై వెండి బంగారు మార్కెట్ ధరలు.

| | |
|---|---|
| వెండి (100 తు.) | 168-0-0 |
| బంగారం (1 తు.) | 89-2-0 |
| సావరిన్ | 58-10-0 |

కలకత్తాధరలు: వెండి 167-4-0; బంగారం 90-8-0, సావరిన్ 59-8-0.

### హైదరాబాద్ మార్కెట్ ధరలు

(సప్లయిదారు సుబ్బా బుచ్చయ్యగారి పంకటేశం.)

హైదరాబాద్, మార్చి 2:

| | |
|---|---|
| బంగారం తు. 1-కి | 105-10-0 |
| వెండి 100 తు. | 198-0-0 |
| పసుపుపల్లా | 50-72-0-0 |
| పెసలు | 48-0-0-56-0-0 |
| కందులు | 41-8-0, 48-8-0 |
| మినుములు | 67-0-0, 68-10-0 |
| ఉలవలు | 58-0-0-53-8-0 |
| ఉలవలు | 80-0-0-81-0-0 |
| కందిపప్పు పెద్దది | 65-66-0-0 |
| కందిపప్పు చిన్నది | 58-0-0-57-0-0 |
| పెసరపప్పు | 90-92 |
| మినప పప్పు | 97-100-0-0 |
| వేరుశెనగపప్పు | 95-95-8-0 |
| ఆముదాలు | 65-1-0 |
| చింతపండు | 50-0-0-60-0-0 |
| మిర్చి | 80-0-0-140-0-0 |
| కుసుములు | 45-8-0-47 |
| ధనియాలు | 10-12-0-11-0-0 |
| జొన్నలు | 10-0-0-10-8-0 |
| ఉల్లిగడ్డలు | 9-12-0-15-8-0 |
| నువ్వులు | 88-104 |

## కావలెను

కంభంలో (కర్నూలు జిల్లా) మా ఆంధ్రపత్రిక, భారతి, మాసపత్రికలను వారి స్వంత బాధ్యతపై విక్రయించుటకు ఏజంట్లు కావలెను.

మేనేజరు, ఆంధ్రపత్రిక.

Edited, Printed & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, Madras.

## రైల్వే బడ్జటు: ఆంధ్ర ప్రాంతాలకు అన్యాయం

### జంధ్యాల దక్షిణామూర్తిగారి విమర్శ

విజయవాడ, మార్చి 1: ఆంధ్రరైల్వే ప్రయాణీకుల సంఘ అధ్యక్షులు శ్రీ జె. దక్షిణామూర్తిగారు యిలా ప్రకటిస్తున్నారు:

"ప్రయాణీకులకు కొద్దిపాటి వసతులు కలిగించుటకూ, కొన్ని ప్రాంతాలలోనూ వీన రైలుమార్గాలు నిర్మించాలని సూచించినందుకు రైల్వేశాఖా మంత్రి అభినందనీయులు. అయితే యించుమించు దేశమధ్యంలో వున్న ఆంధ్రప్రాంతాలలో రైలుమార్గాల అభివృద్ధికి అవకాశం కలుగచేయబడనందుకు బడ్జెటును విమర్శించక తప్పదు. బెజవాడ ప్రాముఖ్యతను గుర్తించినందుకు సంతోషించినా, ఈ స్టేషను అభివృద్ధి విషయమై శ్రద్ధచూపకపోవడం విచారకరం.

కృష్ణానది రైలువంతెన పెద్దది చేయడం చాలా ముఖ్యం. మద్రాసునుంచి నాగపట్టణం, కలకత్తానుంచి మద్రాసుకు ద్వంద రైల్వే లైనుపద్ధతి ఏర్పాటు చేస్తే ఉత్తర, దక్షిణ, ప్రాంతాలమధ్య వుండే విపరీతమైన వొత్తిడి తగ్గించవచ్చు. కృష్ణానదివద్ద ఒకరోడ్డు వంతెనను నిర్మిస్తే మోటారు ప్రయాణాలకు వీలు కలిగి రైలుబండ్లలోని వత్తిడి కూడా తగ్గుతుంది.

ఇకపోతే ఆంధ్రలో రైలుమార్గాలు కొత్తగా నిర్మించవలసినవి చాలా వున్నవి. వీటిల్లో జగ్గయ్యపేట, సూర్యాపేటమీదుగా బెజవాడనుంచి హైదరాబాదుకు, కంభంనుంచి ఒంగోలుకు, ఒంగోలునుంచి కడపకు, నంద్యాలనుంచి కడపకు రైలుమార్గాలు నిర్మించడం చాలా ముఖ్యం. గూడ్సు బండ్లు నడపటం కూడా యీ ప్రాంతాలలో చాలా అవసరం. త్వరలో చౌక టిక్కెట్లకు ప్రాంతీయప్రయాణ పద్ధతి అమలుకు రాగలదని వింటున్నాము. రెండవతరగతి, ఇంటరు తరగతులకు కూడా యీ రేట్లు వర్తింపచేస్తే మంచిది. ప్రతి భారతీయుడు తన మాతృదేశ వైభవాన్ని, పలుప్రాంతాలలో వున్న రామణీయకతను తిలకించి విజ్ఞానం సముపార్జించుకొనగలుగు విధంగా అవకాశాలు కలుగజేయాలి. ఉద్యోగాల విషయంలో భాషాప్రాతిపదికమీద కూడా జరగాలి. ఇప్పుడు తెలుగు ప్రాంతాలలో అసభ్యమైన తెలుగు మాట్లాడుతూన్నా అంగ్లేతరులున్నారు. ఇది జరక్కుండా చేయాలంటే యే ప్రాంతంవారు ఆ ప్రాంతంలోనే నియమించబడటం అవసరం.

ఎలా వున్నా, మిగులుబడ్జెటును చూపినందుకు రైల్వేమంత్రిని అభినందిస్తూ ఆంధ్రప్రాంతాలలో రైలుమార్గాలు అభివృద్ధిచేయవలసినదిగాను మరోసారి కోరుతున్నాము."

## ఆల్ ఇండియా రేడియో గాయకి నిర్ణాయక సంఘం

విజయవాడ, మార్చి 1: ఆలిండియా రేడియో గాయక నిర్ణాయకసంఘ ఉపాధ్యక్షులు శ్రీ టి. వి. సుబ్బారావుగారు నిన్న సాయంకాలం రామమోహన గ్రంథాలయంలో కనకదుర్గ కళాసమితి ఆధ్వర్యములో జరిగిన సభలో సంగీత ప్రాశస్త్యాన్ని గూర్చి, సంగీతంలో వివిధ లక్షణాలను గూర్చి ప్రసంగించారు. శ్రీ ద్వారం వెంకటస్వామినాయుడుగారు అధ్యక్షత వహించారు.

పాటిబండ్ల సుందరరావుగారు సభికుల నాహ్వానించి, సుబ్బారావుగారిని సభికులకు పరిచయం చేశారు.

శ్రీ దంటు శ్రీనివాసశర్మగారివందన సమర్పణతో సభ ముగిసింది.

శ్రీ సుబ్బారావుగారు ఆంధ్రపత్రిక విలేఖరితో మాట్లాడుతూ ఇక్కడ సుమారు 100 మంది గాయకులను పరీక్ష చేశామని, గాయకుల శక్తిసామర్థ్యాలను బట్టి వారిలో తరగతులు నిర్ణయింపబడుతవని, ఎవరో ఒకరిద్దరు మాత్రం ఏ తరగతిలోను నిర్ణయించబడుటకు వీలు లేనివారు నిరాకరించబడగలరని చెప్పారు. (స్వ. వి.)

## ఆంధ్ర 'ఆద్దాఫ్' ముస్లిమ్‌లకు

### డాక్టర్ ఖాజా విజ్ఞప్తి

విజయవాడ, మార్చి 1: భారత దేశంలో ఆర్థికంగా, వైజ్ఞానికంగా వెనుకబడ్డ జాతుల అభివృద్ధికై వారి పరిస్థితుల విచారణకు గాను రాష్ట్రపతి రాజేంద్రప్రసాదుగారు శ్రీ కాకా సాహెబ్ కలేల్కర్ గారి అధ్యక్షతన ఒక సంఘాన్ని నియమించినందుకు తమ కృతజ్ఞతను, సంతోషమును వెల్లడిస్తూ ఆంధ్రజాతీయ ముస్లిము మహాసభ అధ్యక్షుడు డాక్టర్ యం. ఎ. ఖాజా గారు నేడొక ప్రకటన చేశారు. జగజీవనరాంగారి సూచనపై ముస్లిముల లోని అగ్రమైన 'ఆద్దాఫ్'లను సూడ వెనుకబడ్డ వారిగా భారత ప్రభుత్వం గుర్తించినందుకు గూడ తమసంతోషం వెలిబుచ్చారు.

ఆంధ్రదేశంలో దూదివేకులు వృత్తిగాగల 'ఆద్దాఫ్' (నూర్ బాషాలు) తమ వెనుకబాటును గూర్చి ప్రతి గ్రామంలోను తమజనాభా లెక్కలను, తమతమ సమస్యలను, తదితర సమాచారములను సేకరించి కాకాసాహెబ్ ఈ ప్రాంతానికి వచ్చినప్పుడు వివరంగా చెప్పి తమ ఘనోద్భవ్యక్తి విషయంలో శ్రాగత్తపడవలయునని కూడ వీరి ప్రకటనలో ఆద్దాఫ్‌లకు విజ్ఞప్తి చేశారు.





## రాజమండ్రిలో అగ్నిప్రమాదం

రాజమండ్రి, ఫిబ్రవరి 27: నిన్న సాయంత్రము యీ పట్టణములోని కృష్ణారావు పేటలో 40 కార్మికుల పూరిండ్లు పరశురామప్రీతి అయినవి. సుమారు రూ. 15 వేల రూపాయిల ఆస్తి నష్టముంటుందని అంచనా వేయబడినది. స్థానిక అగ్నిమాపక దళము వారు శ్రీ వెంకట్రాజుగారి ఆధ్వర్యమున కష్టపడి పనిచేసి మంటలను త్వరలో ఆర్పగలిగారు! మున్సిపల్ ఛైర్మన్ డాక్టరు ఎ. బి. నాగేశ్వరరావుగారు వారి ఉద్యోగులతో బాధిత ప్రదేశమును చూచి బాధితులకు గతిరాత్రికి శ్రీ గౌతమీ జీవకారుణ్య సంఘము వారి ద్వారా భోజనముల యేర్పాటు చేయించారు. (స్వ. వి.)

## గద్వాల తాలూకాలో స్ఫోటకం, కలరా

గద్వాల, ఫిబ్రవరి 26: గద్వాల తాలూకాలోని యలుహూరు గ్రామంలో స్ఫోటకము, అనంతపురం గ్రామంలో కలరావ్యాధి ముమ్మరంగావున్నవని వార్తలు అందిన వెంటనే యిచటి హెల్తు ఇన్‌స్పెక్టరు ఆ గ్రామాలకువెళ్లి వాక్సినేషన్‌లు యిచ్చివచ్చారు.

హెల్తుఇన్‌స్పెక్టరు శ్రీ రత్నంగారు ఈ విధంగా అన్నారు: "యలుహూరు గ్రామంలో స్ఫోటకంవ్యాధి ముమ్మరంగా వ్యాపించింది. సుమారు అరుయేడువందలమంది గ్రామీణులకు ఈ వ్యాధి సోకకుండా వాక్సినేషన్‌లు యిచ్చాను.

"అనంతపురం గ్రామంలో కలరా వున్నదని వర్తమానంవచ్చి వెళ్ళిచూడగా అచట కలరాచిహ్నములు కనబడలేదు. నలుగురు తొంగుబోతులు వాంతులు చేసుకొని చచ్చిపోయినారు. తాగినకల్లు, రక్తం వారు వాంతిచేసుకొన్నారు. అచట కల్లులో యేవో పదార్థములను గుత్తేదార్లు కలిపియుంటారని నాకు పూర్తిగా అనుమానంకల్గినది. ఈ నా రిపోర్టును ఆబ్కారీశాఖాధికారులకుకూడ పంపినాను. అయినప్పటికీ జాగ్రత్తకొరకు 200 మందికి వాక్సినేషన్‌లు యిచ్చివచ్చాను." (స్వ. వి.)

## ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం

విజయవాడ, మార్చి 1: ఆంధ్ర అభ్యుదయ రచయితల మహాసభను ఏప్రిలు నెలాఖరులోగా జరుపుటకు నిశ్చయిస్తూ శ్రీ తుమ్మల వెంకట్రామయ్యగారి అధ్యక్షతన యిక్కడ సమావేశమైన అభ్యుదయ రచయితలు తీర్మానించారు. ఆంధ్రరాష్ట్ర అభ్యుదయ సంఘ పునర్నిర్మాణానికి శ్రీయుతులు తుమ్మల వెంకట్రామయ్య, అనిసెట్టి సుబ్బారావుగారలు నిర్వాహకులుగాను శ్రీయుతులు శొంఠి కృష్ణారావు, దేవులపల్లి కృష్ణశాస్త్రి, శ్రీ శ్రీ, మరికొందరు సభ్యులుగాను ఒకసంఘం నియమించారు.

ఇటీవల అలంపూరులో విశ్వడిన ఆంధ్రకళా పరిషత్తును అభినందిస్తూ, విశాలాంధ్రలోని కళాకారుల నందరి సమైక్య సంస్థగా ఆ పరిషత్తును రూపొందించుటకు సహాయ పడవలసిందని, ఆంధ్రాభ్యుదయ రచయితలందరినీ అభ్యర్థిస్తూ మరొక తీర్మానం చేశారు. (స్వ. వి.)

## బేసిక్ శిక్షణ పాఠశాల వార్షికోత్సవం

పాలకొల్లు, మార్చి 2: అనవిపాడెం ప్రభుత్వ బేసిక్ శిక్షణ పాఠశాల ద్వితీయ వార్షికోత్సవం యిటీవల మున్సిపలు కమీషనరు శ్రీ హరి మోహనరావుగారి అధ్యక్షతన జరిగినది. వార్షికసభ మున్సిపలు ఛైర్మన్ శ్రీ పోలిశెట్టి వెంకటసుబ్బారావుగారి అధ్యక్షతన జరిగినది. విద్యార్థినీ, విద్యార్థులు అన్నాకెరైలు, ఆవిడి, విశ్వశాంతి అనే నాటకాలు ప్రదర్శించారు.

## "గండికోట ప్రాజెక్టును విస్మరించరాదు"

### కడపలో ప్రాజెక్టు మహాసభ తీర్మానాలు

కడప, మార్చి 1: సిద్ధేశ్వరం గండికోట ప్రాజెక్టుల నిర్మాణ పథకాన్ని పంచవర్షాభ్యుదయ ప్రణాళిక మొదటి దశలో చేర్చమని ప్రభుత్వాన్ని అభ్యర్థిస్తూ అందు కనుగుణంగా నిరంతరాందోళన సాగించమని ప్రజలకు విజ్ఞప్తి చేస్తూ నిన్న ఇక్కడ రత్నసభాపతిగారి అధ్యక్షతన జరిగిన గండికోట ప్రాజెక్టు మహాసభలో కొన్ని తీర్మానాలు చేశారు.

రాయలసీమలోని వివిధపార్టీలవారు ఈ మహాసభలో పాల్గొన్నారు. క్షామ బాధిత రాయలసీమ ప్రాజెక్టులకంటే ముందుగా తమ ప్రాజెక్టుల నిర్మాణానికి అనుమతి పొందినందుకు సర్కారు జిల్లాలవారి వైఖరిని ఆ మహాసభలో పలువురు పెద్దలు విమర్శించారు.

ఏప్రాంతంలోని ప్రాజెక్టులను ముందునిర్మించడం అవసరమనే వివక్షత లేకుండా పంచవర్ష ప్రణాళిక మొదటిదశలో పులిచింతల, నందికొండ ప్రాజెక్టులను నిర్మించే కార్యక్రమాన్ని వక్తలు వ్యతిరేకించారు.

కృష్ణా తుంగభద్రానదులు పుట్టే ప్రాంతంలోని ఆయకట్టుదారులకు సరిపోయినతరువాత మిగిలిన జలాన్ని చెంగల్పట్టు జిల్లాకయినాసరే మరే ప్రాంతానికయినా సప్లయి చెయ్యడానికి ఉపన్యాసకులు తమఇష్టం వెల్లడించారు.

కడపజిల్లాబోర్డు అధ్యక్షులు పుల్లారెడ్డి, కోటరెడ్డి, వెంకటసుబ్బయ్య, ఆదినారాయణరెడ్డి ప్రభృతులు సభలో ప్రసంగించారు. (స్వ. వి.)

## అన్నిపనులపైనా తక్కువ ఖర్చుకు గుంటూరు జిల్లాబోర్డు ఆలోచన

### ప్రభుత్వసలహాను పరిశీలించి జవాబు తయారు చేయుటకు కమిటీ నియామకం

గుంటూరు, ఫిబ్రవరి 28: ప్రస్తుత పరిస్థితుల్లో జిల్లాబోర్డువారు అన్ని పనులపైనా ఖర్చులు చాలావరకు తగ్గించాల్సిన అవసర మేర్పడిందని, కొత్త పనులేవీ ప్రారంభింపకూడదని, రాష్ట్ర ప్రభుత్వమువారు, ప్రాంతీయ ఇన్‌స్పెక్టరు సమర్పించిన నివేదికానుసారం, యిచ్చిన సలహాను పరిశీలించి సమాధానం తయారుచేయుటకు, గుంటూరు జిల్లాబోర్డువారు, నిన్న సాయంకాలం జరిగిన అత్యవసర సమావేశంలో, ఒక ఉపసంఘాన్ని నియమించారు. ఈ ఉపసంఘంలో శ్రీయుతులు ఎన్. వెంకయ్య, శరణు రామస్వామి చౌదరి, గిరిరావు అసన్ సాహెబ్, సత్యనారాయణ, గురవారెడ్డిగారలు సభ్యులు.

గ్రామ పంచాయతీచట్టం అమలులోకి వచ్చినతరువాత, జిల్లాబోర్డు ఆదాయము చాలావరకు తగ్గును. కాని ప్రస్తుతంకూడా ఆదాయంకన్నా ఖర్చు ఎక్కువగా నున్నదికాన, జిల్లాబోర్డు క్రిందనున్న లైసెన్సు ఇన్‌స్పెక్టర్ల సంఖ్య తగ్గించు విషయంగూడ పరిశీలించి నివేదించవలెననిగూడా యీ ఉపసంఘమువారిని బోర్డువారు కోరారు.

### ఇద్దరిసభ్యత్వం రద్దు

బోర్డు అవసర సమావేశమునకు శ్రీ నల్లపాటి వెంకటేశ్వర్లుగారు అధ్యక్షత వహించారు. శ్రీయుత అవుల రామిరెడ్డి, ఆలపాటి వెంకట్రామయ్యగార్లు జిల్లాబోర్డు సమావేశములకు హాజరుకాని కారణంగా లోకల్ బోర్డుల ఆక్టులోని 5వ సెక్షను, 4వ క్లాజు ప్రకారం, వారి సభ్యత్వము రద్దుకావించారు. వీరల సభ్యత్వము యిదివరలో రెండు పర్యాయములు రద్దుకాబడి, పునరుద్ధరింప బడినది.

శ్రీ కొమ్మర్తి నారాయణరావుగారు కూడ యీ సెక్షను ప్రకారం యిదివరలో ఒకసారి తమ సభ్యత్వమును కోల్పోయి మరల పునరుద్ధరణ గావించుకొన్నారు. ఇప్పుడు వీరు కూడ ఆ సెక్షను ప్రకారం సభ్యత్వం కోల్పోవలసి యున్నప్పటికీ, వారికి అవకాశమిచ్చుచు వారి సభ్యత్వమును రద్దు చేయలేదు.

జిల్లాబోర్డు ఎలిమెంటరీ ఎడ్యుకేషను నిధి 1950-51 ఆడిట్ రిపోర్టును బోర్డువారు అంగీకరించారు.

టి. యస్. బి. హైస్కూలు అద్దంకిలకు సంబంధించిన శ్రీ తుమ్మలపల్లి శ్రీరాములుగారి వెండి, బంగారము మొదలగు వస్తువులను వేలంలో విక్రయించిన ఫలితంగా వచ్చిన సుమారు రు. 8,800 లు ఆ స్కూలుకు విరాళంగా భావిస్తూ తీర్మానించారు.

### పొట్టి శ్రీరాములు శిలావిగ్రహం

శ్రీ పొట్టి శ్రీరాముల కంచువిగ్రహ ప్రతిష్ఠాపక కమిటీ, గుంటూరువారు శ్రీ పొట్టి శ్రీరాముల కంచు విగ్రహమును గుంటూరులో ప్రతిష్ఠించుటకై రూ. 5000/-లకు తక్కువగాని విరాళమును యివ్వవలసినదిగా కోరుతూ వ్రాసిన లేఖను చర్చించి విరాళము నిచ్చుటకు నిరాకరించిరి. జిల్లాబోర్డు తరఫువనే పొట్టి శ్రీరాముల చలువరాతి విగ్రహమును ప్రతిష్ఠించుటకు తీర్మానించారు.

జిల్లాలో మొత్తం 16 హైస్కూళ్లలో నూతనంగా VI వ ఫారమును ప్రారంభించుటకును మరో 6 హైస్కూళ్లలో నూతనంగా V ఫారమును ప్రారంభించుటకును, రేపల్లె బోర్డు మిడిల్ స్కూలును హైస్కూలుగా మార్చుటకును తీర్మానించారు.

గుంటూరు జిల్లాబోర్డు యెన్నిక నియోజకవర్గముల విభజన స్థానముల పునర్నియామకము విషయంలో జిల్లాబోర్డు అభిప్రాయాన్ని 1-3-53 లోగా ప్రభుత్వమునకు చేరునట్లు తెలుపవలసిందిగా మద్రాసు ప్రభుత్వ స్థానిక పరిపాలనాశాఖవారి వద్దనుండి వచ్చిన మెమొరాండం చర్చించి, తెనాలి తాలూకా హరిజన సీటును సత్తెనపల్లి తాలూకాకును, వినుకొండ తాలూకా షెడ్యూల్డుకాస్టు సీటు నర్సరావుపేట తాలూకాకును మార్చవలయునని ప్రభుత్వమును కోరుతూ తీర్మానించారు.

## యూరప్ సైన్య పథకం

### ఫ్రాన్స్, ఇటలీల ఆసక్తి

రోమ్, ఫిబ్రవరి 28: యూరప్ సైన్య పథకం వీగిపోకుండా చేయటానికి ఫ్రాన్సు తనశక్తికొలది ప్రయత్నిస్తుందని ఫ్రెంచి విదేశాంగమంత్రి బిడాల్టు నేడొక ప్రకటనలో స్పష్టపరిచారు. పశ్చిమ జర్మన్ ఛాన్సలర్ ఆడెనోవర్, ఇటలీప్రధాని గాస్పెరీ, బెల్జియం, హాలెండ్, లక్సెంబర్గ్‌ల విదేశాంగ మంత్రులతో నాయన రోమ్‌లో పాటు ఈ విషయమై సంప్రదింపులు జరిపి ఈయన ఈ వేళనే పారిస్‌కు బయలుదేరారు.

ఈ సమావేశంలో ఎన్నో విషయాలు సాధించబడెనని ప్రధానిగా స్పీకి విలేఖరులతో మాట్లాడుతూ తెలియజేశారు

## బర్మా సరిహద్దున జాతీయ చైనా సేనలతో పెకింగ్ దళాల సంఘర్షణ: చాంగ్ బలాల బలి

బర్మా-చైనాసరిహద్దు, మార్చి 1: బర్మాకూ-చైనాలోని యూనాన్ రాష్ట్రానికీ మధ్యవున్న 800 మైళ్ల సరిహద్దు పొడుగునా కొమింటాంగ్ చైనా గెరిల్లాలకూ, కమ్యూనిస్టు చైనా సేనలకూ పోరాటాలు జరుగుతున్నవని బర్మా సరిహద్దు రక్షణ అధికారులు నేడు వెల్లడించారు. యూనాన్ సరిహద్దుల్లో ఉన్న ప్రాంతీయరక్షణ దళాలకు తోడుగా పెకింగ్ ప్రభుత్వం రెండు డివిజనసైన్యాన్ని పంపిందనీ, కొమింటాంగ్ వాదులు కేవలం వాడాడిడి చేయ్యడానికి మాత్రమే ఉపయోగిస్తున్నదనీ ఒక బర్మా సైనికాధికారి తెలియజేశాడు. నానాసరిహద్దులు దాటిన కొమింటాంగ్ గెరిల్లాలలో దాదాపుగా అయిదోవంతు మాత్రమే ప్రాణాలతో తిరిగి రాగలుగుతున్నారని అతను తెలియజేశాడు.

కొమింటాంగ్ బలాలు కట్టిదా డిచీయగలవని బర్మా సైనికాధికారులు ఎవ్వరూ అనుకోటం లేదని పి. టి. ఐ. విలేఖరి తెలియజేస్తున్నాడు. చైనాసరిహద్దు రక్షకులు కొమింటాంగ్ గెరిల్లాలను లోపలికి రానిచ్చి, ఆ తరవాత చుట్టుముట్టి పూర్తిగా తుడిచిపెడుతున్నారనీ కాని రెండువైపులనుంచీ జరుగుతున్నదనీ సైతెప్పిన బర్మాసైనికాధికారి తెలియజేశాడు.

కొమింటాంగ్ గెరిల్లాల దాడులు కేవలం గల్లంతువ్యవహారాలుగా ఉన్నప్పటికీ, వాళ్ల ఉద్దేశాలు చూపబోతే మాత్రం పశ్చిమ యూనాన్‌లో ఉన్న కమ్యూనిస్టు వ్యతిరేక ముఠాలలో కలుద్దామని ఉన్నది. బర్మా ప్రభుత్వ సేనలతో జరిగిన పోరాటాల్లో మరణించిన ఒక కొమింటాంగ్ ఉద్యోగి దగ్గర, ఈ విషయమై బర్మాలోని కొమింటాంగ్ సేనాని యూనాన్‌లోని ముఠానాయకులకు వ్రాసిన ఉత్తరాలు దొరికినవి.

చైనా భూభాగంమీద దాడిచేయాలని చాంగ్ కై షేక్ ఇటీవల ప్రకటించినప్పటినుంచీ, కొమింటాంగ్ అనుచరులు బర్మా సరిహద్దుల్లో చెలరేగారనీ సరిహద్దుల పొడుగునా చైనాను అనుకొనివున్న బర్మా భూభాగమంతటినీ ఆక్రమించుకోవాలనీ వాళ్లు ఉద్దేశిస్తున్నట్లుగా కనిపిస్తున్నదనీ బర్మాసైనిక వర్గాలు చెపుతున్నవి. కొమింటాంగ్ సన్నాహాలు ఎక్కువగా బర్మాగోడ్డు వెంట కనిపిస్తున్నవి. ఈ రోడ్డు సాల్వీన్ నదిని దాటి యూనాన్ రాష్ట్రంలోకి పోతుంది.

## సత్తెనపల్లితాలూకా పశుప్రదర్శనం

### రూ 600 ల విలువగల బహుమతుల ప్రదానం

సత్తెనపల్లి, ఫిబ్రవరి 28: ఇక్కడ శరభయ్యగారి హిందూ హైస్కూలు ఆవరణలో తాలూకా పశుప్రదర్శనము 25వ తేదీ బుధవారం జరుపబడినది. శ్రీ జి. సి. హరినాయుడుగారు ప్రారంభోత్సవము చేశారు. వివిధ గ్రామములనుంచి 350 పైగా పశువులు యివిగాక గుర్రములు, మేకలు, గొర్రెలు, పలురకములైనకోళ్లు, టర్కీకోళ్లు కూడ ప్రదర్శింపబడినవి. ఈ సందర్భములో కృత్రిమ సంపర్క విధానము రైతులకు డాక్టరు బెంజమిన్ గారు తెలియపర్చారు. వీటితోపాటు ప్రభుత్వ వ్యవసాయశాఖ డెమాన్‌స్ట్రేటరు శ్రీ టి. బి. దాశరథిగారు ఎరువు తయారుచేయుపద్ధతులు, జపానుపద్ధతి వరిసాగు మున్నగువాటిని ప్రదర్శించారు.

సాయంత్రము శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారి అధ్యక్షతన బహిరంగ సభ జరిగినది. శ్రీమతి పిన్నమనేని అన్నపూర్ణమ్మగారు బహుమతులనుపంచి పెట్టారు. తాలూకా పశుప్రదర్శనమువారు 50 బహుమతులను, సత్తెనపల్లి పంచాయతీబోర్డువారివి 30 బహుమతులు మొత్తము రు 600/-లు విలువగల బహుమతులు యివ్వబడినవి. డాక్టరు గోగినేని కోటయ్యగారి వందన సమర్పణముతో సభ ముగిసినది. (స్వ. వి.)